నేను మఱి యెవ్వఁడను గాను. దుశ్శాసనునిగుండెలు బద్దలుజేసి త్రాగినరుధిరాస
వంబున మత్తిల్లి, కించి దవశిష్టప్రతిజ్ఞామహోత్సవంబునకుఁ దత్తఱ పడుచున్న
పార్థమధ్యముఁడను, భీమసేనుండను, దుర్యోధనద్యూతనిర్జితదాసుండను. వినుండు
మీ రందఱు సాక్షులు.

ఉ. మానధనుండు కార్ముకసమంచితుఁ డై కురురాజు సూడ, నా
తోనిసఖుండు కర్ణుఁడు, మఱిం గురుబంధులు, శల్యుఁడుం గనన్,
బానము చేసినా నిపుడె, పాండువధూకచస్రక్షణాన్
శాత్రవము లుండ నొక్క నెద వ్రచ్చి, కవోష్ణపుఁ బచ్చినెత్తుటిన్ ౧

సూతు — (విని భయముతో) అరే ! కౌరవరాజకుమారమహారణ్యమున
కుత్పాతమారుతుఁ డయినదురాత్ముఁడు భీముఁ డిదిగో ! సమీపించుచున్నాఁడు.
ఈరాజు మూర్ఛ దేఱునంతకును దేరు దూరముగాఁ దోలుకొని పోయి నిలిపెదను.
ఒకవేళ దుశ్శాసను నెడఁ బోలె నితనియెడఁ గూడ నీక్రూరుఁడు దురాగ్రహము
చేయునేమో ? (త్వరితముగాఁ బోయి చూచి) ఆహా ! ఈచెరువులోనితామర
పువ్వులమీఁదనుండి పరిమళముతో వీచెడుచల్లగాలిచేతఁ బల్లవంబులు గదల,
నుల్లసిల్లుచున్న దదిగోఁ పెద్దమఱ్ఱిచెట్టు ; యుద్ధవ్యాపారముచేత శరీరము సొలసిన
వీరపురుషున కిది విశ్రమింపఁ దగినపట్టుగదా ! ఇక్కడ నప్రయత్నోపవీజి
తాలవృంతశీతలంబును హారచందనచ్ఛటాశీతలంబును . సహజపరిమళమిళితంబును
నయి ప్రాణము లేచి వచ్చినట్టు వీచుచున్నయీతమ్మికొలనిమీఁది చల్లగాలి మేను
సోఁకుటచేత నీమహారాజు మూర్ఛ దేఱును శత్రువుచేతఁ గేతనము నఱికివేయఁ
బడినదిగావున నీరథమును నిర్విరోధముగాఁ జెట్టుక్రిందికిఁ దోఁగలదు. (అక్కడఁ
బ్రవేశించి) ఎవ రక్కడ ? (పాఱఁజూచి) ఏఁడీ ? సేవకుఁ డొక్కఁడును లేఁడు.
సరథముగానున్నభీమసేనునిఁ జూచియు, విరథముగానున్నమహారాజును జూచియుం
వాండ్రందఱు నిశ్చయముగా శిబిరమునకే పాఱిపోయిరి. అహా ! ఎంతకష్టము !

చ. దొరఁకొని సింధురాజుతలఁ ద్రుంచెఁ గిరీటి, గురుండు గూలినన్ ;
హరిణమునట్లు చీరె నిపు డక్కట ! భీముఁడు, దుస్ససేను ; దు
ష్కరపుఁబ్రతిజ్ఞలున్ సఫలగాఁ బగవారికి నెగ్గఁ జేసెడున్ ;
గురుకులమందు నింక విధి క్రూరతఁ బాయఁడ యంచు నెంచెదన్. ౨.

(రాజును జూచి) ఏమిది! మహారాజు లిప్పటికిని దెప్పిఱిల కున్నాఁడు! అయ్యో ! ఎంత
కష్టము! (నిట్టూర్పువిడిచి)

తే. గీ. మదపుటేనిక యన్నికొమ్మలను విఱువఁ
జివర నొకకొమ్మతో నున్న చెట్టుఁ బోలెఁ ;

గోమరు లందఱుఁ దెగినయాకులము, కట్ట!
దైవకృప నీవొక్క మిగులుటఁ దప్పి దారి. ౩.

హా! హతవిధీ! భరతకులవిముఖ!

తే. గీ. చెక్కు చెదరక పెనుగదచేతఁ బూని
సందియం బించుకంతయుఁ బొంద కున్న
పవనతనయునియాక్రో అప్రతిన గూడ
నీబలంబున నెఱవేఱు నిశ్చయంబు. ౪.

దుర్యో — (తెలివివచ్చి ధీరముగా) ఆ! దుర్యోధనుఁడను నేను జీవించియుండఁగా దురాత్ముఁ డయిన పవనతనయుని ప్రతిజ్ఞ యెట్లు నెఱవేఱును? తమ్ముఁడా! దుశ్శాసనా! జడియకు జడియకు. ఇదిగో! నేను వచ్చితిని. సూతుఁడా! దుశ్శాసనుఁ డున్నయెడకు రథముఁ బో నిమ్ము.

సూతు — ఆయుష్మంతుఁడా! గుఱ్ఱములు రథమును వహింప లేవు. (వెనుకఁ - జూచి) నీమనోరథమును మేమును.

దుర్యో — (రథమునుండి దిగి గర్వముతో) ఈరథగమనాలస్యముతో నేమి?

సూతు — (తెల్లఁబోయి సకరుణముగా) దేవా! శాంతింపు శాంతింపుము.

దుర్యో — ఇస్సిరో? సూతుఁడా! రథం బేటికి? నేను కేవల మరాతిసమ్మర్ద సంఘట్టసంచారి నగుదుర్యోధనుండను. గదా! గదామాత్ర సహాయుఁడ నయి యుద్ధ గంగమునఁ బ్రవేశించెదను.

సూతు — దేవా! అది నిజమే. ఏమి సందేహము?

దుర్యో — అలా గయిన నీ పల్కు పలికెద వేమి? చూడు.

తే. గీ. ప్రకృతిదుర్లలితుం డగుబాలు ననుజుఁ
బాప హింసింపఁ గాంచి, యావనికిఁ బోవు
నన్ను వారణ సేయుచున్నావు; నీకు
లేదొ క్రోధంబు? దయ లేదొ? లేదొ సిగ్గు? ౫.

సూతు — (దుఃఖముతోఁ గాళ్ళమీఁదఁబడి) దేవా! ఇంతకు నాపాపపువృకో దరుండు సంపూర్ణప్రతిజ్ఞుండయి పోయియుండును గాఁబట్టి యిట్లు విన్నవించెదను.

దుర్యో — (వెంటనే భూమిపయిఁబడి) హా! తమ్ముఁడా! దుశ్శాసన! హా! మదాజ్ఞాపరోధితపాండవ! హా! విక్రమైకరస! హా! మదంకదుర్లలిత! హా! విద్విషత్ప్రకర మదద్విరదకంఠీరవ! హా! యువరాజ! పలుకవేమి? (నిట్టూర్పువిడిచి)

శా. ఒప్పెదు నాదుప్రోపునకు యోగ్యుఁడ వైనను, భోగసౌఖ్య మెం
కప్పుడు నే ఘటింపను; వృథాగ్రజుఁడం గద నీకుఁ దమ్ముఁడా!

యిప్పుడు సంభవం బయినయీ పెనుముప్పున కేన కారణం;
బప్పుడు పంచినా నవినయంబునకున్ నినుఁ; గావ నియ్యోధన్. ౬.

(మూర్ఛిల్లుచున్నాఁడు.)

సూతు — రాజా! ఊఱడిల్లు మూఱడిల్లుము.

దుర్యో — (తెలివి వచ్చి) ఇస్సీ! సూత! ఏమి పని చేసితిః?

తే. గీ. దుష్టమృగమున కెరి యిచ్చి తొలఁగి నట్లు,
బాలు, నాజ్ఞను ద్రోఁ, గాసంగఁ దగిన
యనుజు దుశ్శాసనుని నరి కప్పగించి,
కటకటా! నాదుహాస్యము గాచికొంటి. ౭.

సూతు — మహారాజ! మర్మభేదు లయినయాలుఁగులచేతను, శక్తితోమర ప్రాసాదులచేతను మహారథు లంపెలుఁ దెలివి దప్పి పడి పోవుటవలనను, కేవరయుఁ శేష్టలుదక్క వాహ్యలుటవలనను రథమిట్లు మరలించితిని.

దుర్యో — సూతుఁడా! ఎంతవిరుద్ధము చేసితివి?

క. ఆపాండవపశువులగదా
వ్యాహార పుద్ధ్వములఁ డిపి నందమి గర్జెన్;
శాపని నత్తుటిస్జను
నాపాపియు తేన తెముఁబగనూ? యాది తప్పెన్. ౮.

(నిట్టూర్పు విడిచి యాకాశము చూచి) హా? హతవిధీ! కృపాపరిహీన! భరతకుల విముఖ!

తే. గీ. చంపుకొని పాముత్ర న న్నెటో సరగ నీవ,
పాపపున్మృదరుని బారిఁ బడఁగ నొల్లు;

సూతు — హరి! హరీ! ఏ మిది మహారాజా!

దుర్యో — సకల మగుబంధువర్గంబుఁ జంపుకొన్న
భగ్నిష్టునకు నాకు జయ మేల? రాజ్య మేల? ౯.

(సపరివారుం డయి యొకపురుషుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

పురు — అయ్యా! సారథిద్వితీయుం డగుదుర్యోధనమహారాజు నిచ్చోట మీరు చూచినారా? ఏమిది! ఒక్కఁడును మాట లాడఁడు! కాని, ఇదిగోఁ బరికరములను ధరించినకొందఱుపురుషు లక్కడ గుంపుగా నగపడుచున్నారు. అక్కడకుఁ బోయి యడిగెదను. (చూచి) ఏ మది వా రందఱు గాఢముగా దెబ్బలు దగిలినతమ తేనిహ్పద యమునఁ జిక్కుకొన్నఘనసన్నాహజాలదుర్భేద్యముఖంబు లయినశిఖముఖంబులను కంక ముఖంబులతోడ మెలపునఁ బుచ్చుచున్నారు; కాఁబట్టి వీరి కాగొడవ తెలియదు. పోనీ

మఱియొకచోటఁ గనుఁగొనియెదను. ఇదిగోఁ! గొందఱు వీరపురుషు లిక్కడఁ జేరి యున్నారు. ఇయ్యెడకుఁ బోయి యడిగెదను. (చేరి) అయ్యలారా! కురునాథుఁ డెందున్నాఁడో యెఱుఁగుదురా? ఏమిది! వీరు నన్నుఁ జూచి పెద్దపెట్టున నేడ్చుచున్నారు! (చూచి) వీరికని తెలియదు. ఆహా! ఇక్కడ నెంతదుష్కరము జరుగుచున్నది! ఇదిగో! నీ వీరమాత తనకుమారుఁడు యుద్ధములోఁ జనిపోవుట నాలకించి, రక్తాంబరధారిణియు సమగ్రభూషణయు నయినతనకోడలితోఁ గూడఁ జిచ్చులుకుచున్నది. (సశ్లాఘముగా) బాగు! వీరమాతా! బాగు! నీ వింకొకజన్మమునఁ బుత్రశోకము లేనిదాన వయ్యెదవు. కాని. వేఱొకచోట వరసెదను. (మఱియొకవైపుచూచి) ఇదిగోఁ! గాయములనిండ గాయములు పడినను, వానికిఁ జికిత్స చేసికొనక యాజ్రులు, వస్త్రసల్లముతో నిలిచియున్న యీగుజ్జును జూచి యేడ్చుచున్నారు. దీని నారోహించి యుద్ధమునకుఁ బోయినవీరియేలిక చచ్చియుండును. ఇది నిశ్చయము. కాఁబట్టి వీరికి నెఱుఁక లేదు. పోనీ. కొండొకయెడకుఁబోయి విచారించెదను. (పాఱఁ జూచి) ఏమిది! సర్వజనులును దమతమయవస్థకుఁ దగినదుఃఖము ననుభవించుచు నదృష్టహీనులై తిరుగులాడుచున్నారు. ఇం కెవని నడుగుదును? ఎవని నిందింతును? పోనీ. నేనే విచారించుకొనెదను. (నడిచి) కాదు. దైవమును నిందించెదను. ఓహో! దైవమా! పదునొకం డక్షౌహిణులసేనలకు నధినాథుఁడు, నూర్వురు సోదరులకున్నగారు, భీష్మద్రోణకర్ణాశ్వత్థామశల్యకృపకృతవర్మప్రముఖు లయినదొరలకును దక్షిణరాజచక్రంబునకును నియామకుఁడు, సకలక్ష్మాధిపమండలమునకు నిరంకుశప్రభుఁడు, నయిన దుర్యోధనమహారాజు నిప్పుడు వెదకించుచున్నాను. అతఁ డెచ్చట నుండెనో తెలియఁ జాలకున్నాను (ఆలోచించి నిట్టూర్పువిడిచి) దైవమును దూఱ నేల? ఇదియంతయు దీనివికృతియే గదా! కురునీతినిరాకరణబీజంబును, భీష్మహితోపదేశతిరస్కారాంకురంబును, శకునిహాతకప్రోత్సాహనాది నిరూఢమూలంబును, చిరకాలసంబద్ధవైరాలవాలంబును నగు లాక్షాగృహద్యూతవిషవృక్షంబు ద్రౌపదీకేశాంబరాకర్షణామిషంబునఁ బువ్వుపూచి, తుద కీచందంబున ఫలించినది. (ఒంటివలను చూచి) ఇదిగో! వివిధరత్నప్రభామిశ్రితం బయి తరణికిరణవారంబునుం బోలె దిగంతముల నింద్రచాపములను బుట్టించుచు నొకయరదంబు ఖండితధ్వజవేణుదండం బయి కానంబడుచున్నది. దీనిం బట్టి నిశ్చయముగా దుర్యోధనమహారా జక్కడ విశ్రమించి యుండు నని నేను దలంచెదను. (పోయి చూచి) జయము జయము మహారాజా!

సూతు—(చూచి) దేవా! సమరములోనుండి సుందరకుఁడు వచ్చినాఁడు.

దుర్యో—(చూచి) ఓరీ! సుందరకా! అంగరాజునకుఁ గుశలమే గదా?

సుంద—దేవా! కేవలశరీరమాత్రంబున.

దుర్యో—(తొందరగా) సుందరకా! ఏమి! అర్జునుఁడు శతనిగుఱ్ఱములను జంపెనా? సారథిని వధించెనా? రథమును భగ్నము చేసెనా?

సుంద—దేవా! అతనిరథము నే కాదు; మనోరథమును గూడ భగ్నము చేసెను.

దుర్యో—(రోషముతో) ఓరీ! ఏమిరా యిది? ఒరిసినపుండుల నుప్పు చల్లినట్లు ఇదివఱకే వ్యాకులపడుచున్న నామనస్సును నీసందిగ్ధపుమాటలచేత మఱింతవ్యాకులపఱుచుచున్నావు. అ దేమో స్పష్టముగాఁ జెప్పఁగదరా!

సుంద—అయ్యా! చిత్తము. దేవరవారిమకుటమణిప్రభావము చేత నాగాయముల వేదన యుపశమిల్లినది. (గర్వముతో నడిచి) దేవా! చిత్తగింపుఁడు. ఇదిగో! దుశ్శాసనకుమారునివధ—

(ఇట్లుసగము చెప్పి నోరుమూసికొనుచున్నాఁడు.)

సూతు—సుందరకా! చెప్పుచెప్పు. అది రాజుగారు ఇదివఱకే విన్నారు.

దుర్యో—సుందరకా! చెప్పుము. అది విన్నాము.

సుంద—దేవా! చిత్తగింపుఁడు, ఇదిగో! దుశ్శాసనకుమారునివధ నిరీక్షించి క్రోధావేశంబునఁ బ్రభూపరేణ్యాం డయినకర్ణుండు భీషణమ్ముగా నెమ్మొగమ్మునఁ గనుబొమ్మలు ముడివయిచి, హుమ్మని యతిలాఘవమ్మున సంధానమోక్షణమ్ములు తెలియనలవి గాకుండ, నఖండశరవర్షము గురియించుచు దురంతాకారుం డగునాభీమసేనపాతకుని నెదురుకొనెను.

ఇద్దఱు—తరువాతఁ దరువాత?

సుంద—అనంతర మో దేవా! ఇరువీడులందును గ్రందుకొనుచున్నకరితురగపదాతి సముదయంబులపదఘట్టనముల నెగసినధరాపరాగంబుచేతను, నటునిటు నడుగొండలవలెఁ, బిరుగులాడెడు వేదండతండములచేతను, సంభవించి కాఱుగ్రమ్మిన చిమ్మచీఁకటికతమ్మున నుభయబలమ్ములు నంధీభూతంబులయి భూతలంబును జూడలేకపోయెను.

ఇద్దఱు—తరువాతఁ దరువాత?

సుంద—తరువాత నోస్వామీ! ఆకర్ణాంతము పూర్ణముగా నారి నాకర్షించి విడుచుటవలనఁ గలిగినభీషణధనుష్టంకారంబులు, ప్రళయధారాధరగంభీరగర్జారవానుకారంబు లయి, శ్రవణపుటంబులు ప్రక్కలించుచుండెను.

దుర్యో—తరువాత?

సుంద—తరువాత నోమహాప్రభూ! వారిరువురకును బరివర్తిల్లినదారుణరణంబునఁ బరస్పరసింహనాదంబు లనియెడుఉఱుములును, నన్యోన్యపరిముక్తవివిధాయుధసంఘట్టనంబున ముండెడుమయిమఱుపు లనియెడు మెఱుములును, బహుళరుధిరబిందువు

లనియెడుఖద్యోతబృందములును గలిగి, నిరంతరస్తనితధనుర్జలధరవిసృతశరధారా వర్షంబున దుర్దిర్దినం బయి, దుర్దినంబు సంభూతం బయ్యె.

దుర్యో — తరువాత ?

నంద — పిమ్మట నో దేవా ! ఇంతలోఁ దనయన్నగారికిఁ బరాభవ మగు నని భీతి యెత్తి వజ్రనిర్ఘాతనిర్ఘోషసదృశం బగుచక్రనేమిసంఘట్టనధ్వానంబు ఘోటకహేషారవంబుల నినుమడింప, శిఖరావబద్ధకపిధ్వజప్రభలు కన్నుల మిఱుమిట్లు గొలుప, శంఖచక్రగదాశార్ఙ్గలాంఛితచతుర్భుజుం డగుకృష్ణుండు తురగంబులపగ్గంబులు నడల విడిచి నొగలపయిం గూరుచుండఁ, బిట్టపిడుగులుం బోలె బిట్టొత్తిన పాంచజన్యదేవదత్తంబులపెద్దయెలుఁగు దిఙ్మండలంబు చెవుడు పఱుపఁ, జాపలకు భీతిఁ గొలిపెడు తనయరదంబును బరువెత్తించుకొని కడుఁగయంబునఁ గిరీటి యటకుఁ జనుదెంచె.

దుర్యో — తరువాతఁ దరువాత ?

నంద — దేవా ! అటుతరువాత నీవిధమున భీమార్జును లిద్దఱును దన తండ్రిని డాఁకుట యాలోకించి, తత్తఱపాటుతోఁ దలనుండి జాఱినరత్నాలకుళ్ళాయి సైన గణియింపక, చేయియంటు వింటినారిని దివిచి, లక్ష్యలాఘవంబులు దీపింపఁ, బుంఖానుపుంఖంబులుగాఁ బఱపి, యంపవానల నరిబలంబుల ముంచివేయుచుఁ, బదపదమని సారథిని దొగపెట్టుచుఁ, దత్క్షణంబ వృషసేనకుమారుం డచ్చోటికి వచ్చెను.

దుర్యో — (గర్వముతో) తరువాతఁ దరువాత ?

నంద — తరువాత దేవా ! అట్లు వచ్చి వెంటనే యావృషసేనకుమారుండు, నూత్నకాటుకతీరున నునుపుదేరి నిగనిగలాడుచుండెడుపుంఖములయందు సోగనుగా గ్రద్దఱెక్కలు బిగియించి కట్టి, క్రొత్తగా సానఁబట్టినమెఱుఁగారువెడఁదవాలిదొడ్డనారసంబులు గుప్పఁగూరలుగాఁ బఱపి, ముహూర్తమాత్రములోపల నాకవ్వడి యరదంబును బువ్వులు పూచినచెట్టులాగున నలుఁగులతోఁ గప్పివేసెను.

ఇద్దఱు — (సంతోషముతో) తరువాతఁ దరువాత ?

నంద — అటుపిమ్మట దేవా! అయ్యర్జునుండు తీవ్రముగా బల్లెములవంటివాఁడికోలలు వేనవేలు పఱపి చిఱునవ్వు నవ్వి యాతని కిట్లనియె. ఓరోరివృషసేన ! నీతండ్రి యట్టివాఁడే నాయెదుర దురమున నిలువలేక యున్నాఁడు. నీ వెంతటి పిల్లవాఁడవు? వేఱొకరయొద్ద కేగి నీయీడుకుమారులతోఁ బోరు సలుపుము. అనవుడు నానుడువు లాలించి తనజనకుని నధిక్షేపించినాఁడను కోపంబున మొగమంతయుఁ జేవుఱింప, బొమ్మముడితో హుమ్మని యప్పుడు కఱచి, వృషసేనకుమారుండు గాండీవికి నాకర్ణాకృష్ట

ముక్తంబు లయి మర్మంబులు భేదించు తీవ్రనారాచపరంపరలఁ బ్రత్యుత్తరం బిచ్చెఁ గాని పరుషవచనంబుల నీయఁ డయ్యె.

దుర్యో — వహవా! వృషసేనుఁడా! వహవా! తరువాతఁ దరువాత?

సుంద — దేవా! అనంతరము శాతశరాభిఘాతవేదనా పరిఘూర్ణితనేత్రధాటి రేకుండును, శరవర్షతిరోహితుండును నగు నయ్యర్జునుండు గాండీవజ్యాశబ్దనిర్జితగర్జితారవుం డయి యెల్లవారు మెచ్చ నడునట్లు తన యస్త్రశిక్షాపాండిత్యంబునకు, బాహుబలంబునకు ననురూపం బయిన వ్యాపారము చేయఁ జాగెను.

దుర్యో — (అభిప్రాయగర్భముగా) తరువాతఁ దరువాత?

సుంద — మహాప్రభూ! అబ్బిమ్మట నట్లు మహాశ్చర్యంబుగా సమరచాతుర్యంబును జూపుచున్న తన శత్రువును జూచి వృషసేనకుమారుండును దూణీరమునఁ బాణి యుంచుటయు, నారి తివియుటయు, నలుఁగు దొడుగుటయు, నేయుటయు సహస్రాక్షున కయినఁ దెలియ నలవి గాకుండ నతివిచిత్రంబు గాఁ దనకరలాఘవశరలాఘవంబులు సూపఁ దొడఁగెను.

దుర్యో — తరువాతఁ దరువాత?

సుంద — స్వామీ! అనంతర మేమి చెప్పుదు? అప్పు డెల్లవారును దమతమ యుద్ధంబులు నిలిపివేసి, చిరకాలము నుండి మనంబులఁ గలుగుచున్న క్రోధానలంబును జల్లార్చుకొని యీ యుభయవీరులు సేయు విచిత్రసమరంబును మహాశ్చర్యంబుతోఁ జూచుచుండి యిరువాగులవారు నొక్కుమ్మడిగా 'వృషసేనుఁడా! బళి బళి!'' యని మిన్నుముట్ట మహాకలకలంబు గావించిరి.

దుర్యో — (ఆశ్చర్యముతో) తరువాతఁ దరువాత?

సుంద — తరువాత దేవా! ఇట్లు మేటివిలుకాండ్ర నందఱ నతిక్రమించి తన కుమారుఁడు బాహుపరాక్రమంబు చూపుచుండినతఱి స్వామి యైన కర్ణుండు హర్షగర్వకరుణాశంకాసంకులమానసుం డయి భీమసేనునిపయి సహస్రంబులు తూపులును, వృషసేనునిపై సహస్రంబులు తూపులును బ్రసరింపఁ జేయుచుండెను.

దుర్యో — (భయముతో) తరువాతఁ దరువాత?

సుంద — దేవా! తరువాత నట్లా వృషసేనకుమారుని నిరుపీడులవారును బళిబళి యని ప్రశంసించుటచేత గాండీవి మండిపడి మెఱుఁగులు గ్రక్కుచున్న కఱకుటమ్ముల నొక్కుమ్మడిగ నక్కుమారుని తేరిమీఁదను, సారథిమీఁదను, గుఱ్ఱములమీఁదను, వింటిమీఁదను, నారిమీఁదను, రాజలాంఛన మగు వెల్లగొడుగుమీఁదను వీరావేశంబున వర్షధారలవలె లెక్క లేక కురియించెను.

దుర్యో — (భయముతో) తరువాతఁ దరువాత ?

సుంద — దేవా! తరువాత వృషసేనకుమారుండు భగ్నరథుండు ఖండితకోదండుండునయి గుబాలున భూతలంబునకు లంఘించి తనశత్రువు ప్రయోగించెడు వాలుటమ్ములను జక్రమువోలె గిఱ్ఱునఁ దిరిగి తప్పించుకొనుచుండెను.

దుర్యో — (అడలుతో) తరువాతఁ దరువాత ?

సుంద — అటుపిమ్మట దేవా! తననందనుని స్యందనము చక్కుచేసెనను నక్కసునం బ్రభువైన కర్ణుండు భీమసేనుని తాఁకుడు నొకగణన సేయక వాఁడిసాయకంబుల నర్జునునిపయి నిగిడింపఁ జాగెను. ఇంతలోఁ దనపరిజనుండు కొనివచ్చిన వేఱొకతేరి నారోహించి వృషసేనకుమారుండు వెండియు గాండీవినే తలపడి, యోరోరి మదీయజనకాధిక్షేపవాచాట! మధ్యమపాండవా! నాశరంబులు నీశరీరంబును విడిచిపెట్ట వేఱొకదానెడకుఁ బోవ నిష్టపడకున్నవి. ఇదిగోఁ! గాచుకొమ్మని వేనవేలు వాలుటమ్ము లతని నెమ్మేను గ్రమ్ముకొనం బ్రయోగించి యాలు ముత్రిమినట్లు పెద్ద సింహనాదంబు గావించెను.

దుర్యో — (విస్మయముతో) ఔరా! అతి తేతిసవాఁడు గాకపోయినను గట్టివాఁ డెంతపరాక్రమము చూపెను! తరువాతఁ దరువాత ?

సుంద — పిమ్మట దేవా! ధనంజయుఁడు తనమీఁదికి వచ్చుబాణములనెల్ల నింతలింతలు తునుకలు గావించి రోషావేశంబునఁ గనత్కనకకింకిణీజాలఝంకారవిరావిణియు, మేఘానర్ఘమత్తనభోమండలనిర్మలాకారిణియు, నిశితశ్యామాయసస్నిగ్ధముఖియు, విపక్షాత్మపరిభ్రాభాసురక్షణస్వరూపిణియు రమణీయదర్శనయు నయి తనయరదంబునఁ బ్రజ్వలించుచున్నశక్తి నట్టె యందిపుచ్చుకొని నవ్వుచు నక్కుమారున కభిముఖముగా విడిచిపెట్టెను.

దుర్యో — (విషాదముతో) అయ్యయ్యో! తరువాతఁ దరువాత ?

సుంద — అటుపిమ్మట దేవా! నింగి యంతయు మ్రింగివేయునట్లు భగ్గుభగ్గున మండుచుఁ గుమారునిదెసకు వచ్చుచున్నయాశక్తిని జూచినతోడనే స్వామియయిన కర్ణునికిఁ జేతినుండి ధనుర్బాణంబులును, హృదయంబునుండి వీరసులభోత్సాహంబును, గన్నులనుండి బాష్పబిందుసందోహంబును, వదనంబునుండి వికాసంబును నొక్కమాఱుగా జాఱిపోయెను. అర్జునుండు హసించెను. భీమసేనుండు సింహనాదంబు చేసెను. అతిదారుణ మతిదుష్కర మని మనబలంబులు హాహాకార మొనరించెను.

దుర్యో — (విచారముతో) తరువాతఁ దరువాత ?

సుంద — అటుపిమ్మట నోస్వామీ! వృషసేనకుమారుఁడు దానికి లేశమైన భయంబొందక వాఁడి యయినయొక యర్ధచంద్రబాణమును వింటఁ దొడిగి, గుఱిపెట్టి

చెవి యంట గొనయంబు లాగి, యాశక్తికి సూటిగా దానిని విడిచిపెట్టిన, ఘాలాత్ముని చేత భాగీరథియందువలె మధ్యభాగముననే యది ముత్తునియగాఁ జేయఁ బడియె.

దుర్యో — సెబాసు! వృషసేనుఁడా! సెబాసు! తరువాతఁ దరువాత!

సుంద — తరువాత నో దేవా! హల్లకల్లోలం బగుసమూహంబులాగునఁ గోలాహలంబు గావించెడు వీరవాఁబులసాధువాదంబులకతంబునఁ దూర్యారావంబులు వినంబడ వయ్యెను. అంతరిక్షమున వీక్షించెడుగరుడగంధర్వసిద్ధసాధ్యాది విద్యాధరులు గురిసిన పుష్పవర్షంబున సమరాంగణంబు సంఛన్నం బయ్యె.

దుర్యో — ఆహా! బాలకునిపరాక్రమము! తరువాతఁ దరువాత?

సుంద — తరువాత దేవా! సామి యయినకర్ణుం డిట్లని బలికె. ఓవృకోదరా! నీకు నాకును యుద్ధ మింకను ముగియలేదు; అయినను ముహూర్త మాత్రము నన్ననుమతింపుము. కొంచెముసేపు నాకుమారునియు నీతమ్మునియు ధనుర్వేదశిక్షానైపుణ్యము చూడ వేడుక పొడముచున్నది. ఇది నీవును జూడఁ దగినదే గదా? అని కర్ణుఁడును భీమసేనుండును రణవ్యాపారనిర్బంధము నుండి విముక్తులయి, ముహూర్తమాత్రము పరస్పరవైరముల నణఁచివేసికొని, వృషసేనధనంజయులు సలుపుద్వంద్వయుద్ధంబు నిరీక్షించుచుండిరి.

దుర్యో — (సాభిప్రాయముగా) తరువాతఁ దరువాత!

సుంద — తరువాత దేవా! శక్తినిఖండించినాఁడనుగోపమున నాసమయమున గాండీవి యిట్లనియె. ఓరోరిదుర్యోధనాది — (సగము చెప్పి సిగ్గుపడుచున్నాఁడు.)

దుర్యో — సుందరకా! చెప్పుము. అది పరుఁ డన్నమాట గదా!

సుంద — దేవా! యవధారు. ఓరోరిదుర్యోధనాదికౌరవసేనాప్రభువులారా! ఓరియవినయార్ణవకర్ణధార! కర్ణ! మీరు నేను దగ్గఱలేనియప్పుడు నాకొడుకు నభిమన్యుని నధర్మముగా నేకాకిని జేసి, చంపితిరి గదా! ఇదిగో! నేను మీ రందఱుఁ జూచుచుండఁగా ధర్మయుద్ధమున నీవృషసేనకుమారుని నామైకశేషునిఁ గావించెదను. అని పలికి దర్పాతిరేకంబున నిర్ఘాతఘోషభీషణమహోర్విచండవాదంబగుగాండీవంబు సారించిన, సామియైనకర్ణుండును గాలపృష్ఠం బనునిజకార్ముకంబు నెక్కువెట్టె.

దుర్యో — (సావహిత్థముగా) తరువాతఁ దరువాత?

సుంద — తరువాత నో దేవా! కర్ణునితోఁ బెండియు యుద్ధంబు సేయఁబూనెడు భీమసేనుని వారించి, యర్జునుండు తా నొక్కరుండ కర్ణవృషసేనుల తేరు లనెడు

కాలముల నొరసికొనునట్లు బాణౌఘద్వయంబును బ్రవహింపఁజేసెను. అంత వా రిరువురును బరస్పరస్నేహంబునఁ దమధనుర్విద్యాపాండిత్యవిశేషంబును జూపుచు నయ్యర్జునుం దలపడిరి.

దుర్యో—తరువాతఁ దరువాత ?

సుంద—తరువాత నేమిచెప్పుదు దేవా ! పాండవమధ్యముండు చండగాండీవ మౌర్వీనిర్ఘోషమాత్రప్రజ్ఞాతం బగుశరవర్షంబు నమర్షంబునఁ గురియించుచు, దానికతన భూమియు నాకసంబును, గర్ణుండుఁ గుమారుండును, వారువంబులు పరివారంబును, తేరును సారథియును, కేతనంబు నాతపత్రంబును, దిక్కులు దిక్కులును గన్నుల కగోచరంబు లయ్యె.

దుర్యో—(విస్మయముతో) తరువాతఁ దరువాత ?

సుంద—దేవా ! పిమ్మట నొకక్షణమాత్రములో నాయంపవాన వెలిసెను. అంతలోఁ బాండవసైన్యంబునందు హర్షముతోఁ బెద్దసింహనాదంబులును, కౌరవ సైన్యంబున వృషసేనుఁడు చచ్చెఁజచ్చె ననుహాహాకారంబులును, నొక్కపెట్ట మ్రోగెను.

దుర్యో—(సబాష్పరోషం బయి) తరువాతఁ దరువాత ?

సుంద—తరువాత దేవా ! హతసారథితురంగముండును, ఖండితచ్ఛత్ర చామరచాపకేతనుండును నయి హృదయమర్మభేదకమ్మగు నొకవాలుటమ్మున మేను వ్రీలి, స్వర్గభ్రష్టుం డయినసురకుమారుండునుం బోలెఁ దేరిమీఁదఁ బడియున్న యావృషసేనకుమారునిఁ జూచి వచ్చితిని.

దుర్యో—అహహా ! వృషసేనకుమార ! అటుపిమ్మట వినుట చాలును. హా ! వత్స ! హా ! వృషసేన ! హా ! మదంకదుర్లలిత ! హా ! మదాజ్ఞానుసారి ! హా ! గదాయుద్ధప్రియశిష్య ! హా ! శౌర్యసాగర ! హా ! రాధేయకులప్రరోహ ! హా ! ప్రియదర్శన ! హా ! దుశ్శాసననిర్విశేష ! హా ! సర్వగురువత్సల ! పలుకవేమిరా కుమార.

తే. గీ. కొలిచినను జేరలకు మీఱు గొప్పకనులు,
మోను లెత్తెడునూనూఁగుమీసములును,
గలిగి శశిఁ బోలునీముఖకమల మకట !
కర్ణుఁ డెటు గాంచు, నీవు మ్రగ్గన్న వెట్ట ? ౧౦

సూతు—దేవా ! దుఃఖసాగరమున మునుంగకుము.

దుర్యో—సూతుఁడా! దుఃఖవంతులును బుద్ధ్యాత్ములే సుమీ. ఇఁక మూర్ఛ—

తే. గీ. కనులయెదుర బంధుగణ మెల్ల హత మయ్యె,
నసెడు పరిభవపు దవానలమున
హృదయ మెప్పుడును దహించుక పోయెడు;
నేటిదుఃఖ మింక నేటిబాధ? (మూర్ఛిల్లుచున్నాఁడు.) ౧౧

సూతు—ఓ! అడిల్లు మాఅడిల్లుము. (చేలచెఱంగున విసరుచు) దేవా! అతిదుఃఖమును బొందకుము.

దుర్యో—(తెలివి వచ్చి) సుందరకా! నా చెలికాఁడు కర్ణుఁ డప్పు డేమి చేసెను?

సుంద—తరువాత దేవా! ఆత్తెఱంగున జీవంబులు విడిచిన కొడుకును జూచి, యంగరాజు, కాలువలు గట్టుకన్నీరు చేతులతోఁ దుడుచుకొనుచుఁ, దనశరవేదనను గణియింపక వెండియు గాండీవిని డిలపడియె. అట్లు పుత్రవధామర్షంబున జీవితంబుపై నాస రోసి పరాక్రమింపవచ్చిన యా కర్ణునిఁ జూచి, భీమసేననకులసహదేవులును పాంచాలప్రముఖబంధుగణంబును నయ్యర్జునునరిడంబును బొదివికొనిరి.

దుర్యో—తరువాతఁ దరువాత?

సుంద—దేవా! తరువాత నయ్యర్జును చేతి గాండీవం బనుమహాప్రళయ పయోధరంబు, తెఱపి యీకుండ నఖండశరధారావర్షంబున దశదిశలును ముంచుచుండఁ, గనుంగొని యంగరాజుతో శల్యుం డిట్లనియె. అంగరాజా! గుఱ్ఱంబులు చచ్చినవి. నొగలుఁ జక్రనేమియు విఱిగినవి. ఇట్టిరథ మెక్కి నీవు భీమార్జునుల నెదుర్కొనుట మేలు కాదు. అని చెప్పి మరలించి యాయనను రథమునుండి దింపి పలుదెఱఁగుల నూఱడించెను.

దుర్యో—తరువాతఁ దరువాత?

సుంద—దేవా! గొండొకతడ వాలసించి తరువాతఁ దనపరిజనునిఁ జూచి యంగరాజు, నీవు త్వరితముగా వేఱొకయరదము గొని తెమ్మని సెలవిచ్చిన, వాఁడు నట్లు కావించె. అప్పు డాయన నావైపు చూచి, సుందరకా! ఇటురమ్మని పిలిచిన, నేను వినయముతో సమీపమునకుఁ బోయి నిలిచితిని. అంతటఁ దనముఖపట్టమును దీసి చేతఁ బట్టుకొని, నెత్తుటితో నిండి యున్న గాయములయందు బాణాగ్రమును ముంచి దేవరవారి కీజాబును వ్రాసి పంపెను. (పత్రిక సమర్పించుచున్నాఁడు.)

దుర్యో—(పుచ్చుకొని చదువుచున్నాఁడు.)

స్వస్తిశ్రీ మహారాజదుర్యోధన!

ఈగడియవఱకు గాఢముగాఁ గంఠాశ్లేషము గావించుకొని యుద్ధరంగము నుండి కర్ణుండు సలుపువిజ్ఞాపనము.

మ. వరదివ్యాస్త్రవిశారదుం డితని కెవ్వం డీ డనిన్ ? నాకు నీ
గ్గురుసైన్యోద్ధులకంటె నెక్కు, డితఁడే కూల్పుం బృథాసూనులన్,
దురమం దంచు, బహూకరింతు నను; నే దుశ్శాసనారిన్ భయా
తురతం గూలుపనైతి; నీఁగు వగ నీదోశ్శ్రీనో కన్నీటనో. ౧౨

దుర్యో—వయస్యా! కర్ణుఁడా! ఏమిది! నూఱుగురుతమ్ములను జచ్చి దుఃఖపడుచున్న నన్ను నీవచోభల్లఘాతములచేత మఱింత దుఃఖ పెట్టుచున్నావు. సుందరకా! సరే. ఇప్పు డంగరాజు ప్రయత్న మేమి?

సుంద—దేవా! ఆయన యిప్పు డాత్మవధయందుఁ గృతనిశ్చయుఁ డయి కవచవిసర్జనంబు గావించి యుద్ధమునకుఁ బోవ నుండెను.

దుర్యో—(విని యదరిపడి లేచి) సుందరకా! నీవు త్వరితముగాఁబోయి మిత్త్రుఁడైనయంగరాజుతో నావచనంబులుగా నిట్లు పలుకుము. "మిత్త్రమా! నీ విప్పుడు జయకాంక్షను వదలుకొనుము. మనయిరువురసంకల్పము నొకటియేగదా!

ఉ. పాండవులన్ వధించి, హతబంధుల కిచ్చి నివాపవారి, చా
కుండినవాండ్రతోఁ గలసి యొక్కమ టేడిచి, యింక మీఁద నె
న్నండును లేరు గావున ఘనంబుగ నొండొరుఁ గౌఁగిలించి, యీ
మొండిశరీరముల్ విడిచి పోదము, దుఃఖమొ సౌఖ్యమో తుదిన్. ౧౩

ఇంక దుఃఖమును గుఱించి నిన్ను నే నేమని యూఱడింతును?

క. సూనుఁడు గాఁ డనుకో వృష
సేనుఁడు నీ; కట్ల దుస్ససేనుఁడు నాకున్
దా నను జన్ముఁడు గాఁ; డిఁక
నే ని న్నేమందు? నన్ను నే మనె దీవున్ ?" అని ౧౪

సుంద—చిత్తము దేవా! (నిష్క్రమించుచున్నాఁడు.)

దుర్యో—ఓయీ! బండికండ్లచప్పుడుగా నున్నది.

సూతు—(ఆలకించి) దేవా! అది యిప్పు డధిక మగుచున్నది.

దుర్యో—సరే, పరిజనుఁడు రథమును దోలుకొని వచ్చుచున్నాఁడు. నీవు పోయి దాని నాయితంబు సేయుము.

సూతు—చిత్తము దేవా! (నిష్క్రమించి మరలఁ బ్రవేశించుచున్నాఁడు.)

దుర్యో — ఏమిది రథ మెక్కి రావయితివి ?

సూతు — దేవ ! ఇదిగో ! అమ్మగారును నాయనగారును సంజయునితో రథారూఢు లయి తమయొద్దకె వచ్చుచున్నారు.

దుర్యో — హాహా ! దైవ మెంత బీభత్సము చేసెను ! సూతుఁడా ! నీవు త్వరితముగా రథము నాయితంబు చేసికొని రమ్ము. నేనును నాయనగారి కగపడకుండ దాఁగి యుండెదను.

సూతు — దేవా ! వారికి నీవుతప్ప మఱి యెవ్వరుఁ జుట్టంబులు లేరుగదా ! దేవర కూడ వారి నూఱడింపక పోవుట యుచిత మగునా ?

దుర్యో — సూతుఁడా ! అదృష్టహీనుఁడను నేను వారి నేమని యూఱడింతును? చూడు,

చ. అని కిటు వచ్చుచుండ, మము నమ్మయుఁ దండ్రియు, బాష్పబిందువల్
గనులను రాల మూర్ధములు ఘ్రాణము చేసిక యుండి ; రిప్పు డే
మనుదు నొకండ డగ్గతి ? కటాకట ! మ్రింగిలి దుస్ససేను ; న
త్తనయుని యట్టిదారుణవధ న్విని, యామదియందు లోర్తురే ? ౧౫

వినను దల్లిదండ్రు లవశ్యము వందనీయులు గదా ! (నిష్క్రమించుచున్నారు.)

గద్య. ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదలబ్ధసరసకవితాధురంధర వద్దాది సాం వంశక్షీర
నీరాకరరాకాసుధాకర రాచ్చనామాత్యపౌత్ర హరితసగోత్ర పవిత్రగుణకదంబ
లక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల సూరపరాజప్రధానతనూభవ విబుధ
విధేయ సుబ్బరాయ నామధేయాంధ్రీకృత వేణీసంహార
నాటకంబునందుఁ జతుర్థాంకము.



శ్రీరస్తు.
శ్రీపరమాత్మనే నమః

# వేణీసంహార నాటకము.



## పంచమాంకము.



[తరువాత రథ మెక్కి గాంధారియు సంజయుఁడును ధృతరాష్ట్రుఁడును ప్రవేశించుచున్నారు.]

ధృత—వత్స! సంజయ! కురుకులవనంబున నొక్కఁడే యాకులాగున మిగిలియున్న నాకొడుకు దుర్యోధనుఁ డేమంబున బ్రతికి యున్నాఁడా? లేదా?

గాంధా—సంజయా! నిజముగా బ్రతికి యుండెనేని యెక్కడనున్నాఁడో చెప్పుము

సంజ—ఇదిగో! మహారాజ! ఒక్కఁడు నీ మఱ్ఱిచెట్టునీడను గూరుచున్నాఁడు.

గాంధా—కృష్ణా! డొక్కఁడే యని చెప్పుచున్నావు. ఇపుడు నూఱుగురు తమ్ములును వానిపార్శ్వభాగమున లేరా?

సంజ—నాయనా! అమ్మా! రథము నిమ్మళముగా దిగుండి.

ఇద్దఱు—(దిగుచున్నారు.)

[తరువాత దుర్యోధనుఁడు ప్రవేశించి సిగ్గుతోఁ గూర్చున్నాఁడు]

సంజ—(దగ్గఱఁ బోయి) జయము జయము మహారాజ! ఇదిగో! నాయనగారు అమ్మగారితోఁ గూడ వేంచేసినారు. వారిని జూడ వేమి మహారాజా?

దుర్యో—(తెలతెలఁబోవుచున్నాఁడు.)

ధృత—చ. ఘనకవచంబు దీయఁగనె, కంకముఖంబున నల్లు లూడ్చి, వే
గను వ్రణపట్టికల్ వయిచి కట్టుదు, దిండున నత్తమిల్లి, ద
ప్పున జితశత్రులన్ నృపులఁ బుత్రక! నీవు ప్రియంబునం గనుం
గొనఁ, జెవిఁ జేరి వేదననుగూర్చి నిన్నడుగన్ దురాత్ముఁడన్.

(ధృతరాష్ట్రుఁడు గాంధారియుఁ దడవి చూచి కౌఁగిలించుకొనుచున్నారు.)

గాంధా—కుమారా! తీవ్రమయిన గాయముల వేదనచేత క్షోభపడుచు మాతోఁ గూడ మాటలాడఁ జాలకున్నావా? తండ్రీ.

ధృత—వత్స! దుర్యోధన! ఏ మిది? మును చెప్పుడు నిట్లు కావే! మాతోఁ గూడఁ బలుక వేమి?

గాంధా—కుఱ్ఱా! నీవే మాతో మాట లాడకపోయిన, నిఁక దుశ్శాసనుఁడును దుర్మర్షణుఁడును దక్కిన కొడుకులు నిప్పుడు మాట లాడుదురా యన్నా?

(రోదనము చేయుచున్నది.)

దుర్యో—ఉ. తమ్ములచావు చూచితిని దత్ప్రతికారము సేయ లేక; నే
నమ్మరొ! నీకు నయ్యకును నారనిదుఃఖము దెచ్చినాను; స్వ
చ్ఛ మ్మగుచున్న యీభరతసంతతి మాపఁగఁ బుట్టుపాతకిన్;
నమ్ముఁడి మీకు నేను సుతనాముఁడఁ గాని సుతుండఁ గాఁ జుమీ.

గాంధా—బిడ్డా! ఏలయిట్లు పరిదేవనంబు చేసెదవు? నీ వయిన నీయంధుల కిద్దఱకును దారిఁ జూపుటకుఁ జిరంజీవి వయి బ్రదుకుము. నాకు రాజ్యముతో నేమి? వైరముతో నేమి? (రోదనము చేయుచున్నది.)

దుర్యో—తే. గీ. అమ్మరో! యిట్టివెడమాట లాడఁ దగునె?
పుట్టినది రాచపుట్టువు పొగలె దేల?
సుతశతము రూపు మాయుట చూడ; వెంత
కఠినురాలవొ యిలు నన్నుఁ గావఁ దలఁతు. ౩

ఇది నిశ్చయముగాఁ బుత్రశోకమువలని వికారము.

సంజ—మహారాజా! చేఁద నూతఁ బడినఁ ద్రాడు కూడ నక్కడఁ బాఱవేయఁ గూడ దను లోకోక్తి యబద్ధమా యేమి?

దుర్యో—ఈయుక్తి చాల దోయి. ఉపక్రియాప్రమాణము లేనియప్పు డుపకరణములతో నేమి ప్రయోజనము? (రోదనము చేయుచున్నాఁడు.)

ధృత—(దుర్యోధనుని గాఁగిలించుకొని) అబ్బాయీ! ఊఱడిల్లుము. మిక్కిలి దీనుల మయినతలిదండ్రులను మ మ్మూఱడింపుము.

దుర్యో—తండ్రీ! ఇప్పుడు మి మ్మూఱడించుటకు దుష్కరము; కాని—

ఆ. వె. కుంతి నెప్పు డేను కొడుకులు వచ్చిన
దానిఁగా నొనర్తుఁ దథ్యముగను;
మీరు దానితోఁ గుమారులకొఱ కేడ్చి,
యూఱడించుకొనెద రొకరి నొకరు. ౪

గాంధా—బిడ్డా! నీ వొక్కఁడ వయిన బ్రతికిన నంతే చాలును; నే నెవరిని గూర్చి శోకింతును? కొడుకా! ఇది యుద్ధమునకు సమయము గాదు. శాంతింపుము.

ఇదిగో! దోసిలి పట్టి బతిమాలుకొనుచున్నాను. సమరవ్యాపారము విడిచిపెట్టుము. నామాటలు పెడచెవిని బెట్టకు తండ్రీ!

ధృత—వత్సా! ఎల్లచుట్టములును జచ్చిపోయి దుఃఖించుచున్న మీయమ్మ మాటను నామాటను విను. తండ్రీ! మూఢు.

ఉ. ఏరిబలాన దాయలను నెంచవొ కేరల ద్రోణభీష్ము, లా
తీరునఁ గర్ణపుత్రుని వధించినకీడికి జంకు లోకముల్;
వైరి వధించె నూఱుగురు వత్సల; నీవె మిగుల్ ప్రతిజ్ఞకున్;
బోరికఁ మాను తండ్రి! మముఁ బ్రోవుము కన్నులు లేని దీనులన్. ౫.

దుర్యో—యుద్ధము మాని నేను జేయునది యేమి?

గాంధా—పుత్రకా! మీతండ్రిగారును విదురుఁడును జెప్పినట్లు చేయుము.

సంజ—రాజా! ఇది సత్యము.

దుర్యో—సంజయా! ఇంకను నుపదేశింపఁ దగినయంశ మున్నదా?

సంజ—రాజా! జయము గోరువారికిఁ బ్రాణమున్నంతవఱకుఁ బ్రజ్ఞావంతు లుపదేశింప వలసినదే.

దుర్యో—(క్రోధముతో) అట్లయినఁ బ్రజ్ఞావంతుల రగుమీహితోపదేశ మేమో యిప్పుడు విన్నగా వినెదము.

ధృత—కొడుకా! యుక్తము గాఁబలికినయీసంజయునిమీఁదఁ గోపపడెదవేమి? నిన్ను శాంతింపఁజేయుదానిని నేనే చెప్పెదను. విను.

దుర్యో—నాయనా! సెలవిమ్ము.

ధృత—వత్సా! పెక్కుమాట లేల? ఇప్పుడు యుధిష్ఠిరునకుఁ గోరిన పణంబు నిచ్చి సంధి చేసికొనుము.

దుర్యో—తండ్రీ! పుత్రులయందలిప్రేమవలనిభయమునంజేసి యంబయును, శాలీశత్వమునంజేసి సంజయుఁడును నట్లు పలికినఁ బలికిరి గాక, మీకుఁ గూడ నిది యేమి వెఱ్ఱి? కాకపోయినఁ బుత్రశోకజ్వర మెంతకుఁ జాలదు. నాయనా! నూఱుగురుతమ్ములతో నిండియున్నప్పుడు, నాఁడన్నివిధంబుల సామవాక్యములచేతఁ గృష్ణుండు నన్ను బతిమాలుకొనిన నిరాకరించి, యిప్పుడు భీష్ముండును ద్రోణుండును దమ్ములును సకలరాజచక్రంబును బేరుమాయుట చూచి, కేవల మీతుచ్ఛశరీరము మీఁదియపేక్షచేత, నుదాత్తపురుషలజ్జాకరంబును, ననుభావహంబును నయిన పాండవులతోడిసంధికి, దుర్యోధనుఁడెట్టు లంగీకరించును? ఇంక నొకటి చెప్పెద. నయకోవిదుఁడా! సంజయా!

ఆ. వె. హీను లయినరిపులతో నెట్లు రాజులు
సంధి చేసికొందురు చక్కఁ జెపుమ;

నేను భ్రాతృశతము లేనివాఁడను గద!
పాండుసుతులు కొఱఁత పడనివారు.

ధృత — వత్సా ! ఇట్టియవస్థయందయినను నాప్రార్థనమును ధర్మరాజన్యథాకరింపఁ డిది నిశ్చయము. ఇంకొకటి. యుధిష్ఠిరుఁడు నిన్ను హీనునిఁగా నెంచునని నీ తాత్పర్యము. అది సరి కాదు. అతఁడు సర్వదా తన్ను నీకంటెఁ దక్కువవానిఁగానే తలంచుకొనుచుండును.

దుర్యో — అది యెట్లు?

ధృత — ఇదిగో ! విను. తనతమ్ములలో నొక్కనికేని కీడు మూఁడినఁ, దాను ప్రాణములఁ బాయువాఁడుగా యుధిష్ఠిరుఁడు శపథముఁ జేసినాఁడు. అందుచేతఁ యుద్ధమునం దెల్లప్పుడు నొక్కతీరున సాగి రాదు గావునఁ దమ్ములదెస నేవేళ కేమి పుట్టునో యనుభయంబున నీ కనుకూల మయిన తెఱంగుననే యాతఁడు సంధి సేయుట కిచ్చగించును.

సంజ — ఇది యథార్థము.

గాంధా — బిడ్డా ! యుక్తియుక్తముగా నున్న మీతండ్రిగారిమాట దాఁటక నడుచుకొనుము.

దుర్యో — నాయనా ! అమ్మా ! సంజయా !

చ. అనుజుఁ డొకండు చచ్చినను నాతఁడు సావఁ బ్రతిజ్ఞ పట్టె; నా
యనుజులు నూర్వురుం దెగిన, నక్కట ! ప్రాణముఁ బాయనైతి; నే
నని మొన దుస్ససేనుహృదయంబున నెత్తురు ద్రావు భీము, నా
పెనుగద నుగ్గు సేయ కటు జేలనె సంధిని జేసికొంటకున్ ?

గాంధా — హా ! దుశ్శాసనకుమార ! దుర్మర్షణా ! హా ! వికర్ణ ! అహా ! వీరశతమును గన్నగాంధారి ! దుఃఖశతము నే గాని సుతశతమును గన లేదా ? అయ్యో ! మందభాగ్యురాల నయిన నాయిట్టియాపద లోకమునందుఁ గన్నారా ? విన్నారా ? (అందఱు రోదనము చేయుచున్నారు.)

సంజ — (కన్నీరు దుడుచుకొని) నాయనా ! అమ్మా ! మహారాజునకు దుఃఖశాంతి చేయుట కయి మీ రక్కడకుఁ వచ్చితిరి. మీఁదు మిక్కిలి మీరు కూడ నధైర్యపడిరయెద రేమి ? ఊఱడిల్లుఁడు.

ధృత — కుమారా ! మనయదృష్టము లిట్లుండెను. నీవు వైరులయెడల కోపమును విడిచి పెట్టవయితివి. నీబ్రతుకునే యాధారము చేసికొని యిట్లు పొక్కుచున్న మాయమ్మకును నాకును మఱియెవరు దిక్కు? ఎట్లు బ్రదుకుదుము ?

దుర్యో — నాయనా ! వినుండు.

ఆ. వె. విరివిసిరుల ననుభవించి, యనేకరా
జన్యమకుటదీప్తచరణు లగుచు,
సుతులు నూర్వు రరుల సోలించి వ్రాలిరి;
బ్రతుకఁ జేరు సగరుపగిదిఁ, దండ్రి! రా

ఒండురెఱుంగయిన నాకు రాచపాడి తప్పుట సంభవించును గదా?

(తెరలోపలఁ బెద్దకలకలము.)

గాంధా—(విని భయముతో) సంజయా! ఏమిది? హాహాకారముతోఁ దూర్యధ్వను లెగయుచున్నవి!

సంజ—అమ్మా! మీవంటిభీరుజనమున కిది నిలువ వలసినచోటు గాదు.

ధృత—వత్సా! సంజయా! ఈహాహాకార మంత కంతకు నెక్కువ యయి భయము పుట్టించుచున్నది. అది యేమో తెలిసికొనుము. దీని కేదో గొప్పకారణ ముండక పోదు.

దుర్యో—తండ్రీ! అనుగ్రహింపుము. మనయెడల దైవము పరాఙ్ముఖు డయ్యెను గదా! మగల నేఁడేని మహోపద్రవము చెప్పిన బడక మునుపే, నాకు యుద్ధమునకుఁ బోవ ననుజ్ఞ యిండు.

గాంధా—బిడ్డా! మందభాగ్యురాల నయిననన్ను ముహూర్తమాత్ర మూఱడింపవోయి తండ్రీ!

ధృత—అబ్బాయీ! నీవు యుద్ధమునందే కృతనిశ్చయుఁడ వయితివేని, శత్రుఘ్నులను రహస్యముగాఁ గడతేర్చునుపాయ మాలోచింపుము.

దుర్యో— ఉ. ఏఁ గన వాదుబంధువుల నెల్ల వధించినవారిఁ, జాటుగా
బాగె వధింప? యుద్ధమున వైరులు మెచ్చనిచంపు చంపొకో?

గాంధా—బిడ్డా! నీ వేకాకి వయితివి గదా! ఎవ్వరు నీకుఁ దోడుపడువారు?

దుర్యో— ఈగతి నేన నీసుతుల నెక్కటి చంపనె? వైరు లెంత? యు
వ్వా! గను మిప్పుడే జగ మపాండవమౌ; నిఁకఁ దోడు దైవమే.

(తెరలోఁ గలకలానంతరమున)

ఓహో! యోధులార! ఇప్పుడు జరిగినమహాయుద్ధమును గౌరవేశ్వరునకు విన్నవింపుఁడు. అప్రియము వినఁ జాల కున్నఁ దప్పి పోవునా? ఇప్పుడు కాలానురూపముగా నేమి ప్రతివిధానము చేసికో వలసి యుండునో?

మ. మునికోల న్విడి; యర్జునాంకపుశరంబుల్ స్వాంగముం గాఁడ, వ
చ్చినజాడన్ రథ మీడ్చుకొంచుఁ జన దేశీల్, మెల్ల శల్యుండు, లో
చనబాష్పంబులె కర్ణువార్త పరిజనుల్ స్పష్టంబుగాఁ దెల్పఁ, జొ
చ్చె నిదే శూన్యరథంబుతో శిబిరమున్, జంటిల్లఁగాఁ గౌరవుల్. ౧౦

దుర్యో—(భయముతో) సూతుఁడా! పిడుగువలె వినఁబడుచున్న యీనుడు వెవఁడు పలికెనో తెలిసికో వలయును. ఓరీ! యెవఁడురా అక్కడ?

(త్రొట్రుపాటుతో సూతుఁడు ప్రవేశించుచున్నాఁడు)

సూతు—హా! చచ్చితిఁగదా! (భూమిమీఁదఁ బడుచున్నాఁడు.)

దుర్యో—చెప్పు చెప్పు.

సూతు—దేవా! మఱి యే మున్నది?

ఆ. వె. అలమనోరథంబువలె శూన్యభావంబు
నొనయు కర్ణురథము నెక్కి వచ్చి,
శల్యరూపుఁడగుచు శల్యుండు చేరఁడి
జనము నెల్ల మూర్ఛ మునుఁగఁ జేసె. ౧౧

దుర్యో—హా! వయస్య! కర్ణ! (మూర్ఛిల్లుచున్నాఁడు.)

గాంధా—బిడ్డా! ఊఱడిల్లు మూఱడిల్లుము.

సంజ—ఊఱడిల్లు మూఱడిల్లు మహారాజ!

ధృత—అయ్యో! ఎంతకష్ట మెంతకష్టము!

క. అలమున ద్రోణభీష్ములు
గూలుటనే పొరిపు దక్కఁ గురుసైన్యంబుల్,
మే లయినసఖుఁడు కర్ణుఁడు
నీలీలను నిహతుఁ డయ్యె; నిఁక నెట్లొక్కొ. ౧౨

కుమారా! ఊఱడిల్లు మూఱడిల్లుము. ఓమాయాదైవమా!

ఉ. కన్నులు లేవు; పుత్త్రశతకం బనిఁ జచ్చె; నగాధశోకవా
రాన్నిధి నింటితో మునుఁగఁ గాంచు మునింగితి; నయ్యయో! యిఁకే
మున్నది? బందుగుల్ చెలులు నోర్జలు నాఁడిగ శిగన్య మైరి నీ
వన్నఁగడన్; సుయోధనునిపట్టునఁ గూరెను నాస పేడిసిఁజన్. ౧౩

వత్సా! దుర్యోధన! దీనురా లయినయీయమ్మ నూఱడింపుము.

దుర్యో—(మూర్ఛ దెలిసి)

తే. గీ. కర్ణుఁడా! నీకు నామీఁదఁ గలుగుప్రేమ
పయికిఁ బొరలంగ, నింపుగఁ బలుకవేమి?

పాయ నెన్నఁడు; నీ కెగ్గు సేయ; నైన,
మిత్రు విడిచితె వృషసేనుమీఁదిప్రేమ? ౧౪

(మరల మూర్ఛిల్లుచున్నాఁడు.)

అందఱు— (ఊఱడించుచున్నారు.)

దుర్యో— (ఊఱడిల్లి)

తే. గీ. అకట! నాప్రాణములకంటె నధికుఁ డయిన
యంగరాజిల్లు టాలించి, ప్రాణములను
విడువనందుకే, కడు సిగ్గుపడుచు నుంటి:
నింక నే నూఱడిల్లుట యెట్లు తండ్రి? ౧౫

మఱియు—

తే. గీ. వగవ వలసిన వగవ, నే బాలుఁ డైన
దుస్ససేనునిపదకు, బంధువులమృతికి;
నాకు నత్యుపకారి యొనర్చినట్టి
కర్ణుకుల మెల్ల, మాపితిఁ గాన వగతు. ౧౬

గాంధా—బిడ్డా! క్షణమాత్రము కంటఁ దడి వెట్టకుము.

ధృత—కుమారా! నీ వొక్కమాఱు కన్నీరు దుడిచుకొనుము.

దుర్యో— తే. గీ. నానిమిత్తము తనదుప్రాణములు విడిచె,
నెంత లెంకెలచేతను నీడఁబోక;
యట్టికర్ణునికొఱకు, నే నవద నగుచు
నశ్రుజలమును విడువ, న న్నాఁగఁ దగునె? ౧౭

సూతుఁడా! నే నెన్నఁడుఁ దలఁచుకొనినదియు, నాకులమున కంతక మయినదియు నగునీఘోరకర్మ, మెవఁడు చేసెనో?

సూతు— దేవా! జను లీలాగునఁ జెప్పుకొనుచున్నారు.

"ఆ. వె. తేరికల్లు కింత ధారుణిఁ గ్రుంగ, రా
ధేయుఁ డెత్తికొనెడి తెఱపిలోన,
మనబలంబు రూపు మాపినయర్జును
నలుఁగు లతనితూనులు లపహరించె. ౧౮

దుర్యో— క. అలకర్ణుమోముచందురుఁ
దలఁచిన, శోకాబ్ధి పొంగుఁ; దత్క్షణ మది, నా
యలుక యనుతీవ్రబడబా
నలశిఖలను మరల శోషణంబును జెందున్. ౧౯

తండ్రీ! అమ్మా! మీ రాజడిల్లుఁడు.

ఆ. వె. శోకమునను బుట్టి, చుఱుచుచు నిపుడు నా
యుల్ల మేర్చుచుంట కోర్వఁ జాల;
సమవిపత్తులందు శంక మీ కేల? నా
కాలమునకుఁ బోవ నాన తిండు. ౨౦

ధృత—(దుర్యోధనునిఁ గౌఁగిలించుకొని)

ఆ. వె. సాహసంబులందు శంక నాకు నిజంబె;
తల్లడిల్లు గుండె తలఁప భీము;
మానశౌండ! నీకు మాయ గిట్టదు; కూట
సమరి మరుల; దెట్లు చత్తు నేను? ౨౧

గాంధా—బిడ్డా! నూఱుగురుబిడ్డల మింటఁ గలిపినయాభీమునితోనే వాల నిప్పుడు యుద్ధము సేయఁ బోవుచున్నావా!

దుర్యో—అమ్మా! భీమునిమాట య టుండనీ,

ఆ. వె. నామనోరథంబు, నా మేనిగందంపుఁ
జర్చ, నాదుకనులచందమామఁ,
దల్లి! నీకుమారుఁ, దండ్రి! నినయశిష్యుఁ
గర్ణుఁ జంపినట్టిఖలు వధింతు. ౨౨

సూతుఁడా! ఇంక నిప్పు డాలస్య మేందుకు? నారథమును సన్నద్ధముచేసి తీసికొని రా. నీవును పాండవులకు భయపడితివేని నిలిచి పో. గదామాత్రసహాయుఁడ నయి, నే నొక్కఁడన యుద్ధమునకుఁ బోయెదను.

సూతు—దేవ! నీ వన్యథా తలంపకుము. ఇదిగో! నేను వచ్చుచున్నాను.

(నిష్క్రమించుచున్నాఁడు.)

ధృత—నాయనా! దుర్యోధన! మమ్ము మండఁ బెట్టుటకే నీవు నిశ్చయించు కొంటివేని, యున్నపాటివీరులలో సేనానిఁగా నెవ్వని నయిన నభిషేకింపుము.

దుర్యో—అభిషిక్తుఁ డయి యున్నాఁడే.

గాంధా—బిడ్డా! హతాశురాలిని నన్ను మరల సావలంబననుగాఁ జేయఁ గలిగినయతఁ డెవ్వఁడో చెప్పుము.

ధృత—అబ్బాయీ! శల్యుఁడో? అశ్వత్థామయా?

సంజ—క. కూలఁగ భీష్ముఁడు, ద్రోణుఁడు
కాలము సేయంగఁ, గెడయఁ గర్ణుండును, భూ
పాలా! బలవతి యాశ. యిఁ
కాలములో శల్యుఁ డోర్చు నపాండవులన్. ౨౩

దుర్యో—నాయనా! శల్యుఁ డెందుకు? అశ్వత్థామ యెందుకు?

ఆ. వె. కర్ణుఁ గాఁగిలింపఁ గలిగెనా నో, పార్థ
శిరములు హరింపఁ జేతు లెత్తునో;
కాల్వ లగుచుఁ దొరఁగుకన్నీటిచే నభి
షేచనంబు నాకె చేసికొంటి. ౨౪

(తెరలోఁ గలకలధ్వని చేసి) ఓహో! కౌరవబలప్రధానయోధులార! మమ్ముఁ జూచి భయపడి యిట్టిటు పాఱిపోయెదరేమి? దుర్యోధనుఁ డెక్కడ నున్నాఁడో చెప్పుఁడు. (అందఱు నదరిపడి యాలకించుచుండఁగా సూతుఁడు తత్తఱపాటులోఁ బ్రవేశించుచున్నాఁడు.)

సూతు—దేవా!

తే. గీ. ఇరువు రొక్కరథం బెక్కి, యిందు నందు
నిన్ను నరయుచు వచ్చుచు నున్నవారు;

అందఱు ఎవ రెవరు?

సూతు—కర్ణప్రాణంబుఁ బాపినఘాతుకుండు,
సుగ్రీవకకర్ముఁ డయిన వృకోదరుండు. ౨౫

గాంధా—(భయముతో) బిడ్డా! ఇందుకుఁ జేయునది యేమి?

దుర్యో—అమ్మా! ఇదిగో! గద నాదగ్గఱనే యున్నదిగద!

గాంధా—హా! అదృష్టహీనురాలను నేను జచ్చితినిరా బిడ్డా!

దుర్యో—అమ్మా! నీ విప్పుడు దైన్యపడకు. సంజయ! సంజయ! నాదుఃఖమును బోఁగొట్టు చెలికాండ్రు వచ్చినారు. ఈతల్లిదండ్రులను రథ మెక్కించుకొని పోయి, శిబిరమునఁ బ్రవేశపెట్టుము.

ధృత—నాయనా! వీరభావ మేమో తెలిసికొనియెద; క్షణమాత్రము నిలువ నిమ్ము.

దుర్యో—ఈ తెలిసికొనుట కేమి? తండ్రీ! పొండి.

ధృత & గాంధా—(కొంచెము నడచి కూరుచున్నారు.)

[తరువాత రథారూఢు లయినభీమార్జునులు ప్రవేశించుచున్నారు.]

భీము—ఓ దుర్యోధనపరిజనులారా! మీరు తొట్రుపాటుతో వెలవెలఁ బోవుచుఁ దిరిగెద రేల? మావలన వెఱవకుఁడు.

సీ. కపటంపుజూదంబు కల్పించినఖలుండు, లక్కయి ల్గాల్చినమొక్కలీఁడు,
పాంచాలికొప్పును బైఁట దూల్చినగాలి, యట్టిట్టు గాని మహాభిమాని,
పానిసీలఁగఁ బాండుసూనులఁ గొనుపాపి, దుశ్శాసనప్రభృతులకు రాజు,
గులువ కౌనూర్గురు తోఁబుట్టువులయన్న, యంగరాజునకును బ్రాణసఖుఁడు,

నగుమహారాజుగారు మీయధిపు లిప్పు
డెందుఁ గొలు వున్నవారో మా కెఱుఁగఁ జెపుఁడ;
మేము పగచేత రా లేదు; మిన్న కతని
వదనమును జూచి పోవంగ వచ్చినాము.

ధృత — సంజయా! ఈక్రూరుని యుక్తి పొడుపు మహాదారుణముగానున్నదిగదా!

సంజ — తండ్రీ! వా రీవఱకే పనిచేత మిగులు లేకుండఁ దమయప్రియమంతయుఁ దీర్చుకొన్నారు. ఇప్పుడు మాటలచేత మనకు మేలుఁ జేయుచున్నారు.

దుర్యో — సూతుఁడా! నే నీయుద్దఱియొద్దఁ గూరుచున్నా నని చెప్పు.

సూతు — చిత్తము (పోయి) ఓభీమార్జునులారా! మహారా జిదిగో నాయన గారితోడను నమ్మగారితోడను, నీమఱ్ఱిచెట్టునీడను గూరుచున్నాఁడు.

అర్జు — అన్నయ్యా! పుత్రశోకపీడితు లయినతల్లిదండ్రులను మనదర్శనముచేత మాత్రమెంత యుడలఁ బెట్టుట బా గుండదు. పోవుద మనుగ్రహింపుము.

భీమ — మూఢుఁడా! సదాచారము దాఁటఁ గూడునా? తల్లిదండ్రులు వందనీయు లన్నమాట నీచెవి నెప్పుడుఁ బడ లేదా యేమి? (దగ్గఱఁబోయి) సంజయా. మాతాపితలకు మానమస్కారము దెలుపుము కా దుండు. మేమే తెలిపెదము! (లేరు దిగినారు.)

భీమ — తమ్ముఁడా! నామకర్మములను దెలుపుకొనుచు గురులకు నమస్కరింప వలయును జుమీ!

అర్జు — (దగ్గఱఁబోయి) నాయనా! అమ్మా!

చ. అరులను నందఱం గెలుచు నంచును మీసుతు లేని నమ్మిరో,
గరువముచేత నెవ్వఁడు జగం బఖిలంబు తృణీకరించెనో,
దురమున నట్టికర్ణుపసఁ దూల్చినపాండవమధ్యముండుఁ, మీ
యిరువురు తల్లిదండ్రుల కిదే ప్రణమిల్లెడు భక్తితోడుతన్. ౨౭

భీమ — తే. గీ. కురుకుమారుల నెల్ల నుగ్గుగ నొనర్చి,
దుస్ససేనునిఱొమ్ము నెత్తుటను బలిసి,
యిఁక సుయోధనుతొడలు ఛేదింప నున్న
భీముఁ డిదె మ్రొక్కుచున్నాఁడు పితల కిపుడు. ౨౮

ధృత — దురాత్మా! వృకోదరా! శత్రువుల కపకారముఁ జేసినవాఁడవు నీవు మాత్రమే కావురా. క్షత్రకులమున పుట్టిన దాదిగా వీరులు సమరమున జయాపజయంబులఁ బొందుచునే యున్నారు. ఎందు కీప్రతాపోక్తులచేత మమ్ముడలఁ బెట్టెదవు?

భీమ — తండ్రీ! కోపపడకు.

ఉ. పాండవపత్నిఁ గృష్ణను భవత్సభ కీడిచి తెచ్చి, యామెయు
ద్దండరుషాగ్ని మ్రగ్గి మిడుతల్ బలె రాడ్గణ మంటి గాని, నా
దండితనంబు మెప్పునకు దర్పము చేతను జెప్పఁ; దండ్రి! నీ
వుండవ పుత్రపౌత్రులు మహోద్ధతిఁ జేసెడి వెల్లఁ జూచుచున్. ౩౧

దుర్యో—ఓరి మరుత్తనయ! ఏమిరా యిది? నింద్యమయిననీకర్మమును వృద్ధరాజునొద్దఁ బొగడుకొనుచున్నావు?

మహాస్రగ్ధర. పసరంబుల్ నీకు, నీ, కప్పతికిఁ, గవలకున్, భార్య యాద్యూతదాసిన్,
బొసఁగన్ రారాజ నా నాముదల, కొని సభన్ ముందలం బట్టినా; రీ
యసదృగ్వైరంబునం దాహతు లగున్నపు లేయప్రియుల్ చెప్ప రా; నీ
పసఁ జూతున్, భూరిబాహాబలధనమదదుర్వారు, నన్ గెల్వు మాజిన్.

ఆ! దురాత్మ! ఇదిగో నీవు లేవురా. (క్రోధమునఁ జంపఁ బోవుచున్నాఁడు.)

ధృత—(పట్టుకొని కూరుచుండఁ బెట్టుచున్నాఁడు.)

భీము—(క్రోధము నభినయించుచున్నాఁడు.)

అర్జు—అన్నయ్యా! ఇప్పుడు క్రోధమున కేమి కారణము?

తే. గీ. చెయ్యముల నప్రియం బేమి సేయ లేక,
వీఁడు మాటలఁ జేయుచున్నాఁడు సుమ్మి;
దైనతమ్ములు నూర్గురు నడవిఁ గలిసి,
దుఃఖమునఁ బ్రేలుకొనుచీవిలోడి కేమి?

భీము—ఓరోరి భరతకులకలంక!

తే. గీ. ఇప్పుడే పట్టి వధియించి, యేను దుస్స
సేనునొద్దకు నినుఁ బంప లేనె, తులువ!
మద్గదాకోటినిర్భిద్యమానయూష్మ
దస్థిశబ్దంబు విని గురు లడలరేని? ౩౨

మఱియు నోరిమూఢా!

ఉ. ఆఁడుది వోలె నీవు నెగు లశ్రుజలంబులఁ దీర్చుకొంట, నై
దోడునురంబు వ్రచ్చుతఱి, దూరముగా నిలుచుండి చూచుటన్,
శాడునృపుండ వీ వునుబు వాయవు, మీకుల మన్నతమ్ములేఁ
దూఁడుల కేనుఁ గైళపటుదోర్బలభీముఁడు భీముఁ డల్గినన్. ౩౩

దుర్యో—దురాత్మా! భరతకులాధమ! ద్యూతదాస! పాండవపశువా! నీవలె నేను వ్యర్థప్రలాపములను వచియింపఁ జాలనురా. మఱీమన్న—

తే. గీ. నాగదాదండమునకు భిన్నంబు లైన
బొమ్మ నెమ్ములు వెలిభూషణమ్ము లుగను,
యుద్ధమునఁ బెద్దనిద్దుర నొఱఁగునిన్ను
నిపుడె నీసోదరులు చూచి యేడ్వఁగలరు. ౩౮

భీము — (నవ్వి) అటు లంటిన నీవిషయమున నే మశ్రద్ధతో నుండ రాదు. ఇదిగో! విను నాప్రతిజ్ఞ.

మహాస్రగ్ధర. బెదిదం బౌ కేలుదోయిన్ బిఱబిఱను గదం బిట్టుగాఁ ద్రిప్పి, యూరుల్
పొడిగా నిర్భేది, పాదంబును దల నిడుదుం ద్రొక్కుటం, జూడ తేఁకుల్;
కడిమిం ద్వన్మృత్యుఖ్యాలం జక్కాడఁచి గలదసృక్చందనం బానఖాగ్రం
బాదల న్నెఁబూసికొం చభ్యుదయిభయదభూషోజ్జ్వలన్మూర్తి నౌదున్.

(తెరలో) ఓహో! భీమార్జునులారా! ఇదిగో! నిహతాశేషవిపక్షచక్రుండును నాక్రాంతపరశురామాభిరామయశోవిశాలుండును, ప్రతాపసంతాపితదిఙ్మండలస్థాపిత స్వజనుండును, నజాతశత్రుండును నగు దేవర యుధిష్ఠిరమహారాజుగా రిట్లు లాజ్ఞాపించుచున్నారు.

ఇద్దఱు — మహారాజుగారే మని యాజ్ఞాపించుచున్నారు?

(మరలఁ దెరలో)

చ. అనిఁ దెగువారియంగముల కాప్తు లొసంగుఁడి యగ్నిసంస్కృతుల్;
కనుఁగవనీళ్ళతోడ నుదకంబును బంధుల కిండు బాంధవుల్;
కనుఁడి హతప్రజాటవిని జ్ఞాతులకంకవిఖండితాంగముల్;
గొనకొని, పొద్దుతో రిపులుఁ గ్రుంకిరి; సైన్యములన్ మరల్పుఁడీ. ౩౯

ఇద్దఱు — మహారాజానాజ్ఞ నెఱవేర్పఁ గాక. (నిష్క్రమించుచున్నారు.)

(తెరలో) ఓరోరిగాండీవాకర్షణబాహుశాలీ! అర్జునా! అర్జునా! ఇప్పు డెటఁ బోయెదవురా.

క. తాజన్రాజితము. పడిచితి నీవలుకు న్నిముఁ గెల్చెదు పిల్లద, కర్ణుని పైఁగచే;
నడవిని బోలె విశూరరణంబునఁ బౌరుషపరాక్రమ మయ్యెను మీ;
కడకను వీడినమద్గురుమూర్ధము నంటుట నెంచుచు వచ్చితి; ని
ప్పుడు దుపదాన్వయఘస్మరుఁ డౌగురుపుత్రుఁడు ద్రుంపఁడె పాండవులన్?

ధృత — (విని సంతోషముతో) అబ్బాయీ! దుర్యోధన! ద్రోణవధకరిభ్యోద్దీపితక్రోధానలుండును, దండిక్రొంటెను బరాక్రమవంతుండును, శిక్షావంతుండును, సమరసమానుండును నగునశ్వత్థామ యిదిగో! వచ్చుచున్నాఁడు; నీ వీవీరున కెదురు వోయి సంభావింపుము.

గాంధా — కుమారా! ఈమహాభాగున కెదురు పొమ్ము.

దుర్యో — నాయనా! అమ్మా! కర్ణునిచావు గోరినయీవృథాయౌవన శస్త్రబలభరునితో నేమి ప్రయోజనము?

ధృత — కొడుకా! ఈసమయములో నిటువంటిపరాక్రమవంతులకు వెగటుగా మాటలాడఁ గూడదు.

(అశ్వత్థామ ప్రవేశించుచున్నాఁడు.)

అశ్వ — జయతుజయతు కౌరవేశ్వరః.

దుర్యో — (లేచి) గురుపుత్త్ర! ఇటు కూరుచుండుము. (కూరుచుండఁ బెట్టుకొనుచున్నాఁడు.)

అశ్వ — రాజా! కౌరవేశ్వర!

తే. గీ. కర్ణముల కింపుగాఁ బల్కి, కర్ణుఁ డాజి
యందుఁ జేసినపని, తెల్ల మయ్యెఁ గాదె?
ద్రోణి యిప్పు డధజ్యశరానుఁ డగుచు
వచ్చె; నీవైరులను డాఁకు? వగవ కింక. ౩౮

దుర్యో — (అసూయతో) ఆచార్యపుత్త్ర!

ఆ. వె. అంగరాజు చచ్చినంతట గద, నీవు
యుద్ధ మొనరఁ జేయ నుండినావు;
నేను జచ్చువఱకు నీవు ప్రతీక్షింపు;
కర్ణునకును నాకుఁ గలదె వేఱు? ౩౯

అశ్వ — ఏమి? ఇప్పటికిని గర్ణునియందుఁ బక్షపాతమును, మాయెడలఁ దిరస్కారమునా? రాజా! కౌరవేశ్వరా! తథాస్తు. (నిష్క్రమించెను.)

ధృత — కుఱ్ఱా! నీ కిది యేమి వెఱ్ఱి? ఈసమయములో నంతమహాభాగుఁ డయినయశ్వత్థామకు, నీవు పుల్లవిఱుపుమాటలచేత మనను విఱుగఁ జేసితివి.

దుర్యో — ఇతని కేమి యప్రియము? నే నసత్యము పలికినాఁడనా? ఇది నాకుఁ గ్రోధస్థానము గా దేమి? చూడు,

చ. ధనువులు పూను రాజులకుఁ దల్ప నశక్యపుఁ జెయ్వివాని, నీ
కొనరినభాగ్యదోషమున యుద్ధమునం దెగినట్టివాని, నిం
దఱ కొనరించె, నాయెదుర, నాప్రియమిత్త్రుని, నంగరాజు; న
ర్జునునకు ద్రోణపుత్త్రునకుఁ, జూడ విశేష మదేమి చెప్పుమా. ౪౦

ధృత — నాయనా! నిన్ననవలసిన దేమి? భరతకులమున కిది యవసాన సమయము. గాంధారీ! మందభాగ్యుఁడను నే నిప్పు డేమి చేయుదును? (ఆలోచించి) కానీ. సంజయా! భారద్వాజుఁడయినయశ్వత్థామతో నాపలుకులుగా నిట్లు పలుకుము

చ. తడవుగ వీనిలోఁ గుడుచు స్తన్యము నేమతి నాఁడవయ్యె? నీ
వాడలను ద్రొక్కఁ, నావలువయుం బార దన్యోను నీదుబాల్యమం
దుడుగనిభ్రాతృదుఃఖమునకో, చిరమైత్రికో, వ్యత్యయంబుగా
నుడివినవీనికో, గురుతనూభవ! పెంపకుమయ్య క్రోధముం. ౪౧

సంజ — చిత్తము. (లేచుచున్నాఁడు.)

ధృత — మఱియు నిట్లని కూడ వచియింపుము.

క. అనృతము వించు నీజనకుఁ డట్టులు శస్త్రము నుజ్జగించుటం,
గనుఁగొన నంతవానికిని గర్గినతాదృశ మానవజ్ఞయుం,
దనయుఁడ వైననీరుబలదర్పములుం, దలపోసి లే, సుయో
ధనుపలు కెంతువా? ప్రతివిధానము సేయుదు గాక ద్రోణజా! ౪౨

సంజ — చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు.)

దుర్యో — సూతుఁడా! మాయుద్ధరథమును సన్నద్ధము సేయుము.

సూతు — చిత్తము దేవా! (నిష్క్రమించుచున్నాఁడు.)

ధృత — గాంధారీ! మన మీలాగున మద్రాధిపతి యయినశల్యునిఁ జిదికిం బోవుదము. అబ్బాయీ! నీవు నిట్లు చేయుము. (చెవిలో) ఈలా గీలాగు (అందఱు నిష్క్రమించుచున్నారు.)

గద్య. ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదలబ్ధసరసకవితాధురంధర వడ్డాది సాధువంశక్షీర
నీరాకరరాకాసుధాకరాచ్చన్నామాత్యపౌత్ర హరితసగోత్ర పవిత్రగుణకదంబ
లక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల సూరపరాజప్రధానతనూభవ విబుధ
విధేయ సుబ్బరాయ నామధేయాంధ్రీకృత వేణీసంహార
నాటకంబునందుఁ బంచమాంకము.



శ్రీ ర స్తు.

శ్రీపరమాత్మనే నమః

# వేణీసంహారనాటకము.



## షష్ఠాంకము.

———:o:———

[తరువాత నాసనస్థుఁడయి ధర్మరాజును, ద్రౌపదియుఁ, జేటియుఁ, బురుషుఁడును బ్రవేశించుచున్నారు.]

యుధిష్ఠిరుఁడు — (విచారముతో నిట్టూర్పు విడిచి)

ఉ. ఎట్టెటో భీష్మసాగరము నీఁదియు, ద్రోణమహాగ్ని నార్చియున్,
గట్టిఁడికర్ణపన్నగము గాసిలఁ జేసియు, శల్యుఁ గూల్చియున్,
గిట్ట! యొకింత తక్కువగఁ గాంచుజయంబున, మాకు నెల్ల ని
ష్పట్టున, భీముసాహసపుఁబల్కున జీవితశంక పుట్టెఁగా! ౧

ద్రౌపది — (కన్నీళ్ళతో) మహారాజా! పాంచాలిచేత నని యెందు కనరు?

యుధి — ద్రౌపదీ! నాచేతనే సుమీ! (పురుషునిఁ జూచి) బుధక!

పురు — దేవా! ఆజ్ఞాపింపుఁడు.

యుధి — నీవు పోయి సహదేవునితో నిట్టు చెప్పుము. భీమసేనుండు క్రోధావేశంబున "నేఁ డీదినంబునఁ దప్పక సుయోధనుని వధించెదను; లేకున్న నేను జచ్చెద" నని చేసినదారుణప్రతిజ్ఞను దెలిసికొని, మహాభిమాని యయిన దుర్యోధనుఁడు మాయ మయ్యెను. కావున వానిజాడ నెఱింగి వచ్చుటకు, మిక్కిలి నిపుణమయినబుద్ధి గలిగినట్టియు, నయ్యాయికందువల నెఱింగినట్టియు భక్తివిశ్వాసములు గలిగినట్టియు సచివులం, దప్పటలతోడఁ జాటించుచు, శమంతపంచకమునఁ జరింప వలయును; దుర్యోధనుజాడఁ దెలిసి వచ్చినవారికి, ధనము మొదలుగాఁ గలపసదనంబు లీయఁబడు నని, స్పష్టముగాఁ దెలుప వలయును.

మఱియు —

సీ. నీళ్ళజాడలు దీయ నేర్పుజాలరు లూబినేలలం దినుకల నెమక వలయు;
నల్లిబిల్లిగఁ దీఁగ లల్లుడొంకల నెలుంగుగొల్లలు సొదలఁ గన్గొనఁగ వలయు;
నిజపరశరణాంకనిపుణు లౌ నెఱుకులు వ్యాఘ్రాటవులయందు నరయవలయు;
రంధ్రప్రజ్ఞులైనమేల్ప్రణిధులు జడదారివేసాల మునులొద్ద వెదుక వలయు;

పురు—దేవా! చిత్రము.

యుధి—మఱియు నిట్లని కూడఁ జెప్పుము.

తే. గీ. అలుకుచు రహస్యమున మాట లాడువారి,
సుప్తులను, రోగులను గూడఁ, జూడ వలయుఁ;
బులుఁగులయెలుంగు, మృగములకలఁతె, రాచ
గుఱుతునడుగులు, నడవిలో నెఱుఁగ వలయు. ౨

పురు—చిత్రము దేవా! (నిష్క్రమించి మరల వచ్చి సంతోషముతో) దేవా! పాంచాలకుఁడు వచ్చినాఁడు.

యుధి—శీఘ్రముగాఁ దీసికొని రా.

పురు—(నిష్క్రమించి పాంచాలకునితో మరల వచ్చి) ఇదిగో! రాజుగారు; సన్నిధికిం బొమ్ము.

పాంచా—(సమీపించి) దేవా! జయముజయము. దేవరకును దేవేరికినిఁ బ్రియముఁ దెలుప వచ్చితిని.

యుధి—భద్ర! పాంచాలక! దురాత్ముఁ డయినయాకౌరవాధమునిజాడ, యే మయినఁ దెలిసినదా యేమి?

పాంచా—దేవా! జాడ మాత్రమే గాదు; దేవీకేశాంబరాకర్షణమహాపాతకహేతుభూతుం డగునాదురాత్ముఁడే తెలిసికోఁబడెను.

యుధి—(సంతోషముతోఁ బాంచాలకునిఁ గౌఁగిలించుకొని) భద్ర! మేలు మేలు! ప్రియ మెఱింగించితివి. మఱి కంటె కగపడినాఁడా?

పాంచా—దేవా! యుద్ధమున కగపడినాఁడా యనుంతు.

ద్రౌప—(భయముతో) ఏమి నానాథుఁడు సమరగోచరుఁడై యున్నాఁడా?

యుధి—(సంశయముతో) నిజముగా మాతమ్ముఁడు యుద్ధములోనే యున్నాఁడా?

పాంచా—మహారాజుగారితో నేను మఱియొకలాగు మనవి చేసికొందునా?

యుధి—తే. గీ. కారణము లేకయే మది కలఁతపడుచు,
నూరక వివేకహీనత నొందు చుండె;
గదను ధరియించుభీమువిక్రమ మెఱిఁగియు,
సందియముఁ బొందుచున్నాను జయమునందు. 3

(ద్రౌపదివంకఁ జూచి యామెమోమునుండి కన్నీళ్ళు దుడిచివేయుచు) ఓసుక్షత్రియురాలా!

చ. గురువులు బంధువుల్ నృపతికోట్లు గనన్, మన కైననాఁటిదు
ష్పరిభవ ముత్తరింప నిరుపద్రుతు లున్నవి; యెవ్వి యన్న, సుం
దరి! మన మైన నందఱముఁ, దప్పక ప్రాణము పాయఁగా వలెన్;
గురుకులపాంసనుం డయిన, గొబ్బునఁ జావ వలెన్ రణంబునన్. ౮

అయినను సందేహ మెందుకు?

తే. గీ. ప్రతినచెడు నేమొ యని, భయపడుచు నున్న
యమ్మహావీరుచే నిశ్చయముగఁ జచ్చు,
నిండుఁగొలువున నీతలవెండ్రుకలను
బట్టి, ని న్నీడిపించినపాపపశువు. ౯

పాంచాలకా! చెప్పుచెప్పు. ఆదురాత్ముఁ డెట్లు లగపడెను? ఇప్పు డెక్కడ నేమి జరుగుచున్నది?

పాంచా—దేవా! దేవీ! చిత్తగింపుఁడు. దేవరవారిచేత నట్లు మద్రేశుం డయినశల్యుండు దెగుటయు, శకునిశలభంబు సహదేవానలంబునం బడి మ్రగ్గుటయుఁ, దిక్కునకొలఁదిపాటిజోదులు, తమదళవాయిచావును జనములయాక్రందనమును జూచి, రణరంగమునకుఁ దొలంగిపోవుటయు, మనసైన్యంబులు శత్రుపరాజయంబు గాంచి పొంగుచు, విచిత్రపరాక్రమంబున ధృష్టద్యుమ్నాధిష్ఠితంబు లయి యుండుటయుఁ, గృపకృతవర్మాశ్వత్థామలు విచ్చి మొగ్గుటయు నాలోకించి, దురాత్ముఁ డక్కౌరవాధముఁడు బెంగగొని, భీమసేనునిదారుణప్రతిజ్ఞకు నదలి యెక్కడనో యడఁగి పోయెను.

యుధి—ఛీ! యేమి పని చేసెను? తరువాతఁదరువాత?

ద్రౌప—ముందుసంగతి చెప్పు

పాంచా—దేవా! దేవీ! అవధరింపుఁడు. తరువాత భీమార్జును లిద్దఱును, వాసుదేవాధిష్ఠితం బయినరథం బెక్కి, శమంతపంచక మంతటను వెదకిరి; గాని వానిజాడ కొంచె మయినను దెలియ రాదయ్యెను. పిమ్మట మాకోఁటిభృత్యులు దైవమును దలంచి శోకించు చుండిరి. అర్జునుం డుస్సు రని వేఁడినిట్టూర్పులు పుచ్చుచుండె. వర్షకాలమున నంధకారబంధుర మగురాత్రివేళఁ, దళతళ మనియెడు మెఱుంగులతెఱంగున వెలింగెడుపింగళేక్షణంబుల, భీమసేనుండు నిజగదాదండంబును బ్రజ్వలింపం జేయుచుండె. భగవంతుఁ డయినకృష్ణుండు విధిచెయ్వుల దూఱుచుండె. అట్టిసమయంబున నొకానొకపురుషుండు, తనచేత మాంసభారమును బట్టుకొని, క్రొత్తగాఁ జంపిన మృగమునెత్తుటం జొత్తిల్లినకాళ్ళతోడను, గట్టుఁబట్టతోడను, బరుగుపరుగున వగర్చు

కొనును భీమసేనునిసన్నిధికి వచ్చి, నిట్టూర్పులసందడిని సగముసగము వినఁబడియెడు నక్షరములచేత సూచింపఁ దగిన మాటలతో, నిట్లు విన్నవించెను. దేవా! ఈచేరువ నొకమహాహ్రదంబుతీరంబున మడుఁగులో దిగినయడుగులజాడలు రెండు గనంబడు చున్నవి. అం దొకటి నీళ్లనుండి వెడలి వచ్చినట్లున్నది. రెండవది యట్లు గాదు. మీఁద దేవరచిత్తము. అనుటయు మే మందఱముఁ దొందరగా బయలుదేఱి యామడుపుఁ జూపుటకు వప్పురుషుని ముం దుంచుకొని పోయితిమి. అనంతర మారెండపపదపద్ధతి దుర్యోధనుని దగుట నిరూపించి భగవంతుండు కృష్ణుం డిట్లనియె. ఓవృకోదర! దుర్యోధనుఁడు జలస్తంభవిద్య నెఱుంగును గదా. దానంజేసి నిశ్చయముగా నీకు జడిసి, వాఁ డీమడుగున దాఁగి యున్నవాఁడు. అనిన నబ్బలానుజునిమాట విని యుబ్బి, దిక్కు లెల్లం బూరటిల్ల మొసళ్లు మొదలయినజలజంతువులు తల్లడిల్ల, మడువంతయుఁ గలఁగి పోవ, భీమసేనుండు భీకరంబుగాఁ బెద్దబొబ్బవెట్టి యిట్లనియె. ఓరోరివృథాప్రఖ్యాపితాలీకపౌరుషాభిమానీ! పాంచాలరాజతనయాకేశాంబరాకర్షణమహాపాతకీ! ధార్తరాష్ట్రాపసదా!

చ. పొడమితి విందువంశమునఁ; బూనితి వెప్పటికి న్మహాగదన్;
విడువక దుస్ససేనునురి వెచ్చనినెత్తురు ద్రావుశతుగ్రి నన్
గడునిరసించి; తల్లు మధుకైటభవైరిని ధిక్కరించి; యి
ప్పుడు పసరంబ! పంకమున మున్గి యడఁగితి నాకు జంకుచున్. ౬

మఱియు నోరిమానధనా! కౌరవాధమా!

ఉ. కాగవనిష్కుటంబు లొగిఁ గాంతులు చచ్చి విముక్తకేశవి
స్తారము కౌట, నాకతన ద్రౌపదిక్రోధమహానలంబు చ
ల్లారెను; దుస్ససేనుహృదయంబున నెత్తురు ద్రావఁ జూచి, యీ
మారుతి నేమి చేసి? ఇది మానము చంపుకొనంగ వేళయే? ౭

ద్రౌప—నాథా! నీవు మరల వచ్చి నాకంటఁ బడితివేని నాకోపము తీఱినట్టే.

యుధి—ద్రౌపదీ! యీసమయమున నమంగళములను నోట రానీయఁగూడదు. భద్ర! తరువాతఁ దరువాత?

పాంచా—దేవా! తరువాత నివ్విధంబునం బలుకుచు, వృకోదరుండు వీర్యక్రోధోద్ధతుం డయి, భీషణగదాదండంబును బిఱబిఱం ద్రిప్పుచు, నువ్వెత్తుగ లోన నుఱికి, యుల్లంఘితతీరంబు, నుత్సన్ననలినంబు, నున్మూర్ఛితగ్రాహంబును, నుద్భ్రాంతసమస్తశకుంతంబును నయి యమ్మహాహ్రదం బంతట నుడిగుండములు పడునట్లు భయంకరముగా నీ రంతయుఁ గలిపి వేసెను.

యుధి—భద్రా! అట్లయినను వెలువడ లేదుగదా?

పాంచా—దేవా! యెట్లు వెలువడ కుండును?

చ. పెలుచ భుజంబులం జఱచి, భీముఁడు పెన్మడుపుం గలంచినన్,
బలుఁదతికొండకవ్వమునఁ బాల్కడలి న్మథను కాలకూటముం
బలె, నొకమూలనుండి కురుపాంసనుఁ డుత్కటకోపపావకో
జ్జ్వలతమవిస్ఫులింగముల సత్వరుఁడై వెడలెన్ హ్రదంబునన్. ౮

యుధి—సుక్షత్రియా! మేలు మేలు!

ద్రౌప—యుద్ధమునకు వచ్చినాఁడా లేదా?

పాంచా—అట్లు లాజలాశయంబునుండి వెలికి లేచి, యిరుగరంబులఁ బెనుగదనుఁ బిఱుబిఱుం ద్రిప్పుచు, దుర్యోధనుం డిట్లనియె. వృకోదరా! నీభయంబున నేను డాఁగితి నని సమర్థించుకొనుచున్నావా? మూఢుఁడా! పాఁడుపుత్రులను జంపుకుఁడఁ బరులకంటెం బయటకు సిగ్గుపడుచు, బడలిక దీర్చుకొనుటకై పాతాళమునకుఁ బోయి యుంటిని. అను చుండునంతలోఁ, గృష్ణార్జును లిద్దఱునుం బోయి, నీళ్లలో గదాయుద్ధము సేయఁగూడ దని, భీమదుర్యోధనుల నొడ్డునకుఁ దీసికొని వచ్చిరి.

అప్పుడు కౌరవనాథుండు గూరుచుండి, తనచేతిగదను గ్రిందఁ బెట్టి, వచ్చిపోయిననూఱుగురుతమ్ములయు, వాజివారణవీరభటులయుఁ, గళేబరంబులను, గాకులును గ్రద్దలును రాపులుఁగులును నక్కలును గుక్కలును బీఁకికొనితినుచుండుటచేత భీభత్సంబైనదియు, దుర్యోధనబలంబు పేరు మాసినదియు, మనవీరులసింహనాదములకతమ్మున నిమ్మడిగా మొరసెడురణతూర్యములచేత సంకుల మయినదియుఁ, దనచుట్టములందొక్కఁడైన లేనిదియుఁ బగవారిబంధువులతో నిండియున్నదియు, నగుకౌరవయుద్ధరంగంబును దేఱి పాఱఁ జూచి యారారా జున్నరని వేఁడినిట్టూర్పులు పుచ్చుచుండె.

యుధి—తరువాతఁ దరువాత?

పాంచా—దేవా! అయ్యవసరంబున వృకోదరుం డిట్లనియె. ఓయికౌరవరాజా! బంధుజనమునుగూర్చి దైన్యపడుటచే నేమి ప్రయోజనము? పాండవులు సమర్థులు, నే నసహాయుఁడ నని విషాదంబు నొందకుము.

తే. గీ. నీవు యుద్ధంబు సేయ, మాయేవురందు
నిచ్చ వచ్చినవానిని నేఱుకొనుము;
కవచము ధరించి, వలయుకైదువులు గొంచు,
నలుపు మాతనితో రణోత్సవము నేఁడు. ౯

అనుపలుకు లాలించి యాకురురాజు, కొంచెము గన్నీటితోఁ గూడుకొనిన చూపును భీమార్జునులమీఁద నిలిపి యిట్లనియె.

ఆ. వె. కర్ణు, దుస్ససేనుఁ, గడతేర్చినట్టిమీ
యిరువురును, సమాను లిపుడు నాకు;
నప్రియుండ వయిన, నతిసాహసుండ వౌ
నీవ, ప్రియతముండ వెంచ ననికి. ౧౦

అని లేచి। పరస్పరక్రోధాక్షేపపరుషవాక్యలహాప్రిసారితఘోరసంగ్రాములై భీమదుర్యోధనులు, నిజభుజాదండంబుల విచిత్రగదాపరిఘుంబులు శోభిల్ల, మండల ప్రచారంబుల విహరించుటకు నారంభించిరి. అంత నేను భగవంతుం డయినచక్రాయుధునిచే కేవలయొద్దకుఁ బంపఁబడితిని. మహానుభావుం డయినదేవకీనందనుండు మీతో నిట్లు మనవిచేయు మనియె. భీమసేనుం డపర్యూషితప్రతిజ్ఞుం డగుటయు దుర్యోధనుండు విచ్చుమొగ్గగుటయుఁ గాడ, మాకు మిక్కిలి విషాదంబు గలిగినది. ఇంక నిప్పుడో, భీమసేనుచేత సుయోధనుండు చిక్కినాఁడు గావున, నిష్కంటకం బయిన యీభూతలం బంతయు నీ వేలుకొమ్ము. అభ్యుదయోచితంబు లగుననవరతమంగళసమారంభంబులు సమకట్టింపుము. సందేహము వలదు.

మ. తగ నింప న్వలె రత్నకుంభములు త్వద్రాజ్యాభిషేకార్థమై;
మిగులం బండువు సేయఁగా వలెను చేట్కం ద్రౌపదీవేణికిన్!
జగతిన్ క్షత్రియరుచ్చిదాపరశుభాస్వత్పాణి యౌ రాముఁడున్,
మొగిఁ గ్రుద్ధుం డగుభీముఁడున్, సమరముల్ బూనంగ జం కేటికిన్?

ద్రౌప — త్రిభువనాధనాథుం డగుదేవుం డిట్టు లానతిచ్చుచుఁడ, మఱియొకలాగేల జరుగును?

పాంచా — ఇది కేవల మయ్యానురాంతకునియాశీర్వచనము కాదు. ఆదేశమే.

యుధి — భగవంతుం డగునమ్మహాత్మునిసందేశమున కెవ్వఁడు సంశయించును? ఎవఁడురా అక్కడ?

[కంచుకి ప్రవేశించుచున్నాఁడు.]

కంచు — దేవా! ఆజ్ఞాపింపుఁడు.

యుధి — దేవకీనందనుం డయినదేవునిప్రసాదంబున, భీమునివిజయమంగళశంసార్థంబుగాఁ, దదుచితసమారంభములు సమకట్ట వలయును.

కంచు — చిత్తము దేవా! (ఉత్సాహముతో నడచి) ఓహో! సంవిధాతృపురస్సరు లగునంతఃపురదౌవారికులారా! యథాప్రధానంబుగా మీ రందఱు వినుండు.

భుజబలపరిభూతపౌర్ణికాకరపరిభవసాగరుండును, నిర్వ్యూఢదుర్ధరప్రతిజ్ఞాభరుండును, సుయోధనానుజశతోద్ధూననప్రిభంజనుండును బ్రిభంజనతనయుండును, బలవంతుండును, దుశ్శాసనోరస్స్థలవిదళనరసింహుండును, దుర్యోధనోరుస్తంభభంగవినిశ్చిత విజయుండును నగువృకోదరునికి, విజయమంగళంబుల సమకట్టవలయు నని, స్నేహపక్షపాతిమానసంబున నిదిగో! దేవరయుధిష్ఠిరమహారాజుగా రాజ్ఞాపించుచున్నారు.

(ఆకాశమందు)—ఏ మంటివి? అంతట నధికతరముగా సమకట్టిరియున్నామే; నీవు చూడవా యేమి యనుచున్నారా?

కంచు - నాయనలారా! మేలుమేలు! చెప్పకయే మేలు చేయుట మనోగతంబయినస్వామిభక్తిని వెల్లడించును గదా!

యుధి—ఓయిజయంధర!

కంచు—దేవా! ఆజ్ఞాపింపుఁడు.

యుధి—నీవు పోయి, మాకు మేలువార్తను దెచ్చినయీపాంచాలకునిఁ బసదనంబులఁ బరితోషపెట్టుము.

కంచు—చిత్తము దేవా! (పాంచాలకునితో నిష్క్రిమించుచున్నాఁడు.)

ద్రౌప—మహారాజా! హృదయేశుఁ డయినభీమసేనుఁడు మరల నద్దురాత్మునితోడ "మాయేఘురయందు నిచ్చవచ్చినవానిని నేలుతును" మని యెందునిమిత్తమనెను? ఒకవేళ వాఁడు మాదీనులు బిడ్డలలో నొకనిఁ గోరుకొని, యాతనితో సమరంబు సేయఁ బూనిన, మహోపద్రవంబు సంభవిల్లును గదా?

యుధి—ద్రౌపదీ! ఆజరాసంధపరిపంథితాత్పర్య మిది; సకలబంధువులును, వీరభటులును జచ్చిపోయి, పదునొకం డక్షోహిణులసేనలపుఁ, గృపకృతవర్మాశ్వత్థామలు ముగ్గురు మాత్రిమే మిగిలిరి; కావున, దుర్యోధనుం డిప్పుడు బంధురహితుండును, శరీరమాత్రవిభవుండునునయి, యున్నవాఁడు. అందుచేత నొకవేళ, నభిమానమును వదలిపెట్టి వీఁ డస్త్రసన్యాసము పుచ్చుకొనినను, దపోవనము ప్రివేశించినను, బిత్రృముఖంబున సంధిని గోరినను, సకలరిపులను జయింతు నని, పూనినతనప్రితిజ్ఞ నెఱవేఱ కుండు నని యెంచి, వానికిఁ గొంచె మాస పుట్ట, నట్లు వచియించెను. పాండవు లయిదుగురలో, నొకనితోడ నయిన యుద్ధము సేయుటకు, దుర్యోధనుఁడు చాలఁడు సుమీ. అయినను వృకోదరునకే వీనితోడ గదాయుద్ధము కావలయు నని నేను తలంచుచున్నాను. ఓసుకుమారియురాలా! చూడు.

మ. అలుకన్ బెన్నదఁ బూనుభీమునికి సత్యం బీ దెవం డాతలో;
బలరామోహుముఁ డాసుయోధనుఁ డనిన్, శాంచద్గదాకౌశలిన్;
గలుగున్ భద్రము ధార్తరాష్ట్రనలినీగంధేభుఁ డౌతుట్రకున్;
దలఁతున్ భీమునికే సుయోధనునితోఁ; దక్కెంచు నే నొండ్లకున్. ౧౨

(తెరలో) ఓహో! దప్పి గొంటిని. దప్పిగొంటిని. కొంచెము నీళ్ళును, నీడయు నిచ్చి నన్ను సంభావింప వలయును.

యుధి— (విని) ఓరీ! యెవఁడురా అక్కడ?

[కంచుకి ప్రవేశించుచున్నాఁడు.]

కంచు— దేవా! ఆజ్ఞాపింపుఁడు.

యుధి— ఆ దేమో తెలిసికొని రా.

కంచు— చిత్తము దేవా! (నిష్క్రమించి మగలఁ బ్రవేశించి)

కంచు— దేవా! వడగొట్టి యొకయతిథి వచ్చియున్నాఁడు.

యుధి— శీఘ్రముగాఁ దీసికొని రా.

కంచు— చిత్తము దేవా! (నిష్క్రమించుచున్నాఁడు.)

[తరువాత మునివేషధారి యయినచార్వాకుఁ డనెడురాక్షసుఁడు
ప్రవేశించుచున్నాఁడు.]

రాక్ష— (తనలో) నేను దుర్యోధనునిమిత్త్రుఁడ నయినందుకుఁ బాండవుల నెట్లయిన వంచింప వలయును. (ప్రకాశముగా) దప్పిగొంటిని దప్పిగొంటిని. కొంచెము నీళ్ళును నీడయు నిచ్చి నన్ను సంభావింప వలయును. (రాజును జేరుచున్నాఁడు) (అందఱు లేచి నిలువఁబడుచున్నారు.)

యుధి— మునీంద్రా! నమస్కరించుచున్నాను.

రాక్ష— ఇది సముదాచారమునకు వేళ గాదు. కొంచెము జల మిచ్చి నన్ను సంభావింపుము.

యుధి— మునీంద్రా! మీ రీయాసనమునఁ గూరుచుండుఁడు.

రాక్ష— (కూరుచుండి) మీరు కూడ మీమీస్థలములఁ గూరుచుండుఁడు.

యుధి— ఓరీ! యెవఁడురా అక్కడ?

[బంగారుగిండి చేతఁ బట్టుకొని కంచుకి ప్రవేశించుచున్నాఁడు.]

కంచు— దేవా! ఇదిగోఁ! జల్లనిపరిమళోదకముచేతఁ బూర్ణ మయిన భృంగారము. ఇది దాహము పుచ్చుకొనుటకుఁ బంచపాత్రము.

యుధి— మునీంద్రా! నీయపట్టును దీర్చుకొండి.

రాక్ష—(కాళ్ళు గడుగుకొని యాలోచించి) ఓహో! నీవు క్షత్రియుని లాగున నున్నావు.

యుధి—దేవరవారు చక్కగా నెఱింగిరి; నేను క్షత్రియుండనే.

రాక్ష—ప్రతిదినము మాగక పోరాడుచు, స్వజనవినాశము చేసికొనెడు మీ నీళ్ళు మొద లగునవి, పరిగ్రహింపఁ గూడదు. కానీ, ఈనీడచేతను, సరస్వతీ నది లోనితరంగములను స్పృశించి వీతెంచెడుచల్లగాలిచేతను, నేను శ్రమను దీర్చు కొనియెదను.

ద్రౌప—బుద్ధిమతికా! ఈ సనకజ్జుతో మహర్షికి విసరవే.

చేటి—(అట్లు చేయుచున్నది.)

రాక్ష—పూజ్యురాలా! మాయెడల నిట్టియుపచారము లనుచితములుగదా!

యుధి—మునీంద్రా! మీ రెందుచేత నింతయలసట గలిగినది?

రాక్ష—ఓయీ! వటుజనసులభ మయినవేడుకచేతఁ, బూజ్యు లయిన క్షత్రియోత్తముల ద్వంద్వయుద్ధము జూచుట కయి, శమంతపంచకమునఁ దిరుగుచుండి, యర్జునసుయోధనుల కగుగదాయుద్ధము నవలోకించి, బలవత్తర మయిన యాశరదాతపతైక్ష్ణ్యంబున కోర్వ లేక, యుద్ధము ముగియ కుండనే చక్క వచ్చితిని.

అందఱు—(విషాదమును బొందుచున్నారు.)

కంచు—మునీంద్రా! అలాగు కాదు. భీమసుయోధనుల కని చెప్పుఁడు.

రాక్ష—(అసూయతో) ఆ! సంగతి తెలియనివాఁడవు, న న్నెట్టు లాక్షే పించెదవు?

యుధి—మునీంద్రా! చెప్పుండి చెప్పుండి.

రాక్ష—క్షణమాత్రము విశ్రమించి నీ కంతయుఁ జెప్పెదను; కాని యీ ముసలివానికిఁ జెప్పను.

యుధి—చెప్పుండు. ఏమి? అర్జునసుయోధనులకే?

రాక్ష—అర్జునసుయోధనుల కగుగదాయుద్ధ మని నే నీవఱకే చెప్పి యుంటిని.

యుధి—భీమసుయోధనులకుఁ గాదా?

రాక్ష—అది యంతకు మునుపే జరిగి పోయినది.

[యుధిష్ఠిరుఁడును, ద్రౌపదియు మూర్ఛిల్లుచున్నారు.]

కంచు—(నీళ్లు చల్లి) దేవా! దేవి! ఊఱడిల్లుఁడు.

చేటి—దేవీ! ఊఱడిల్లు మూఱడిల్లుము.

ఇద్దఱు—(తెలివిని బొందుచున్నారు.)

యుధి—మునీంద్రా! ఏమి చెప్పితిరి? భీమసుయోధనులకు గదాయుద్ధ మంతకు మునుపే జరిగి పోయిన దేమి?

ద్రౌప——స్వామీ! ఏమో చెప్పండి అంతకు మునుపే జరిగి పోయినదా?

రాక్ష—కంచుకీ! వీ రిద్దఱు నెవరు?

కంచు—బ్రాహ్మణోత్తమా! ఈయన యుధిష్ఠిరమహారాజు. ఈమె ద్రౌపదీదేవి.

రాక్ష—హా! ఘాతుకుఁడనైన నేను దారుణమైనసంగతి నుపక్రమించితినిగదా!

ద్రౌప—హా! ప్రాణేశ్వరా! భీమసేన! (మూర్ఛిల్లుచున్నది.)

కంచు—ఇప్పుడు చెప్పిన దేమున్నది?

చేటి—దేవీ! ఊఱడిల్లు మూఱడిల్లుము.

యుధ—(కన్నీళ్లతో) బ్రాహ్మణోత్తమా!

తే. గీ. పదము సందిగ్ధముగ నుంటఁబట్టి, యిట్లు
తీవ్రదుఃఖంబుఁ బొందు యుధిష్ఠిరుండు;
భీమునిశ్చితవార్తను వినినపిదపఁ,
బ్రాణములఁ బాసి సౌఖ్యంబు పడఁగలండు. ౧౩

రాక్ష—(సంతోషముతోఁ దనలో) ఇదే నా ప్రయత్నమును. (ప్రకాశముగా) అలాగయిన, నవశ్యము చెప్పవలసినసంగతులను సంగ్రహముగాఁ జెప్పెదను. బంధువ్యసనమును విస్తరించి చెప్పి, మఱింతచింత కలిగింపఁ గూడదు.

యుధి—(కన్నీ రొలుకుచుండ)

తే. గీ. ప్రణతి గావింతు సరగఁ జెప్పంగదయ్య,
సంగ్రహంబుగనో సవిస్తరముగానొ;
యనుజా దిస నేమి మూఁడెనో వినుట కేను,
సావధానత నుంటి, వాచంయమీంద్ర! ౧౪

రాక్ష—రాజా! వినుము.

చ. కరము గదాధ్వనుల్ నిగుడఁ, గౌరవభీములు పోరువోటికిన్,

ద్రౌప—(హఠాత్తుగా లేచి) తరువాతఁ దరువాత?

రాక్ష—(తనలో) వీ రిద్దఱకు మరలఁ దెలివియున్నది రాకుండుటకు నే నేమి చేయుదును? (ప్రకాశముగా)

సరగ బలుండు రా, నతనిసన్నిధిఁ బోరిరి చాలసే; పునం
తర మతిశిష్యవత్సలతఁ, దద్బలరాముఁడు సంజ్ఞసేయ, న
క్కురుపతి, దానికి దెలిఁగి, కూల్చె వృకోదరు నొక్కపెట్టునన్. ౧౫

యుధి—హా! తమ్ముఁడా! వృకోదరా! (మూర్ఛిల్లుచున్నాఁడు.)

ద్రౌప—హా! ప్రాణేశ్వరా! హా! భీమసేన! నాకుఁ గలిగినపరాభవమును సహింపలేక, నీజీవమును విడిచి పెట్టితివా? నాథా! హా! జటాసురబకహిడింబకిమ్మీరకీచకజరాసంధనిషూదన! హా! సౌగంధికాహరణచాటుకార! హా! పలుకవేమి? ప్రాణేశ్వరా! (మూర్ఛిల్లుచున్నది)

కంచు—(కన్నీళ్ళతో) హా! భీమసేనకుమార! హా! ధార్తరాష్ట్రకులకమలినీప్రాలేయవర్ష! మహారాజా! ఊఱడిల్లుము. బుద్ధిమతికా! దేవిగారి నూఱడింపవే. మునీంద్రా! మీరు కూడ మహారాజుగారి నూఱడింపుఁడు.

రాక్ష—(తనలో) ఆ! ప్రాణత్యాగము చేయ నూఱడించెదను. (ప్రకాశముగా) ఓయిభీమాగ్రజ! ఇంకను జెప్పవలసిన సంగతి యున్నది. ఒక్కక్షణ మూఱడిల్లుము.

యుధి—(మూర్ఛదేఱి) మునీంద్రా! ఇంకను జెప్ప వలసిన దున్నదా?

రాక్ష—అట్లు ధానుష్కత్రయుండు నిహతుండై, వీరసులభంబైనపుణ్యగతిం బొందిన, భ్రాతృవధను జూచుటచేతఁ బొరలి పొరలి వచ్చుదుఃఖంబునఁ గన్నీరు కాలువలై పాఱ, నర్జునుండు, గాండీవంబు విడిచి పెట్టి, క్రొన్నెత్తుటం దొత్తిల్లి యున్న భీమునిగదను, బిగిసికొని పోయినయతనిచేతనుండి బలవంతముగా నూడఁదీసికొని. తన్నుఁ గృష్ణుఁడు సంధి సేయం దలంచి వారించుచున్నను, భ్రామితగదాఝుంకారమూర్ఛిత గంభీరవచనస్వనుండై, చిఱునవ్వుతోఁ గౌరవేశ్వరుండు రారమ్మని పిలుచు చుండంజేసి, నీమూఁడవసోదరుఁడు వెనుకదీయక, యాతనితోడ యుద్ధంబున కుపక్రమించెను. అప్పుడు మిక్కిలి లాఘవంబు గలిగిన యానుయోధనునిగదాఘాతంబున విన్వచ్చుఁడు చచ్చునకా నిశ్చయించి, బలరాముం డర్జునపక్షపాతి యయినకృష్ణుని బలవంతముగాఁ దనరథ మెక్కించుకొని, ద్వారకానగరంబునకుఁ గొంపోయెను.

యుధి—మేలు మే లర్జునా! గాండీవమును విడిచి పెట్టుటచేత, వెంటనే నీవు భీమునిమార్గమును బొందఁ గలవు. ఇఁక నే నేయుపాయమునఁ బ్రాణత్యాగమహోత్సవము చేసికోఁ గలను?

ద్రౌప—హా! నాథా! భ్రాతృవత్సల! గదాయుద్ధమున నేర్పు చాలని నీతమ్ముఁడు, నీచేతిలోనిగదను బలవంతముగాఁ బుచ్చుకొని పగవానికభిముఖముగాఁ బోవుచుండ, నీ వుపేక్షించుట యుక్తమగునా? (మూర్ఛిల్లుచున్నది.)

రాక్ష—తరువాత నేను—

యుధి—సరే.. మునీంద్రా! అటుపయిని వినుట యెందుకు? హా! భీమసేన! హా! జతుగృహసముద్రతరణయానపాత్ర! హా! కిమ్మీరహిడింబాసురజరాసంధ జయమల్ల! హా! కీచకసుయోధనానుజకమలినీమదకుంజర! హా! ద్యూతపణపణాయి! హా! మామకశరీరస్థితిపరిఖేదశంకానిషూదన! హా! మదాజ్ఞాసంపాదక! హా! కౌరవవనదావానల!

ఉ. సుంతయు సిగ్గు లేక టులు జూదరి నైనపు డీవు భక్తిమై
దంతిసహస్రసత్త్వుఁడవు దాసుఁడ వైతివిగా! కృశించి; నీ
కంతకు నిప్పు డెక్కుడగు నాపదఁ జేసితినయ్య? తమ్ముఁడా!
యెంతయు దిక్కుమాలి విలపించెదున న్నెడఁబాపి తెయ్యయో! ౧౫

ద్రౌప—(మూర్ఛ దెలిసి లేచి) మహారాజా! ఏ మయినది?

యుధి—ద్రౌపదీ! మ తే మున్నది?

మ. బకకిమ్మీరహిడింబసూదనుఁడు, దృప్యత్కీచకప్రాణఘా
తుకుఁడు, న్మాగధగంధసింధురభిదాదుర్వారనిర్ఘాతుఁడున్,
బ్రకటస్ఫారగదోగ్రదీర్ఘభుజుఁడు, న్నాతమ్ముఁడు, న్నీదునా
యకుఁ డౌదుర్జయ తర్జనాగ్రణుఁడు, కట్టా! యస్తమించెన్ గదా! ౧౬

ద్రౌ—(ఆకాశమునఁ జూపు నిలిపి) ప్రాణేశ్వరా! నీవు స్వయముగా నాకురులను ముడుతు నంటివి. వీరుఁ డయినక్షత్రియునకుఁ బలికిన దప్పుట యుక్తము గాదు; కావున నిదిగో! నేను వచ్చుచున్నా నుండుము. (వెండియు మూర్ఛిల్లుచున్నది)

యుధి—(ఆకాశమువంకఁ జూచి) అమ్మా! కుంతీ! విన్నావు గదా నీపుత్రనిసమాచారము! అనద నయి విలపించుచున్న న న్నొంటరిగా విడిచిపెట్టి, తా నెక్కడకో పోయినాఁడు తండ్రీ! జరాసంధశత్రూ! నీ కింతలోనే నూతెండ్లు నిండుటకు, నీయందు లోకు లేమివైపరీత్యము నాలోకించిరి? వారు గాదు. నేనే యనేకములు పొడ గాంచితిని.

చ. నృపు లరిగాఁపు లౌవసుధ యెల్లను నా కిడి సిగ్గు గొంట, నేఁ
గపటపుజూదపుంబణముగా నిడ, నల్గక యొప్పుకొంట, నే
నెపుడు సుఖింప, నవ్విరటునింటను వంటలవాఁడ వౌట, తే
టపడెచె, నీకు నాయూ వకటా! కడు నల్ప మటంచుఁ, తమ్ముఁడా! ౧౭

మునీంద్రా! ఏ మన్నారు?

॥చ. కరము గదాధ్వనుల్ నిగుడఁ గౌరవభీములు పోరుచోటికిన్,
సరగ బలుండు రా, నతనిసన్నిధిఁ బోరిరి చాలసే; పనం

తర మతిశిష్యవత్సలతఁ దర్భులరాముఁడు సంజ్ఞఁ జేయ, వ
క్కురుపతి దానికిఁ దెలిసి, కూర్చి వృకోదరు నొక్కిపెట్టునన్.'' ౧౯.

రాజ — అవును. అది యాలాగే.

యుధి — ఛీ! నాయదృష్టము. (ఆకాశమువంకఁ జూచి) భగవానుఁడా! కామపాల! కృష్ణాగ్రజా! సుభద్రాభ్రాత!

మ. ఎద మేన త్రికుమారు లన్ప్రియము నీ కేదీ? నృపన్యాయమా
యదె? నాతమ్మునితోడ నీయనుజు నెయ్యం బైన నూహింపవై;
తిది యేమీ? ప్రియశిష్యు లిద్దఱును, నీ కీపక్షపాతంబు గూ
డదు; మాచో దయమాలి తేమనను? కట్టా! నేను నిర్భాగ్యుఁడన్. ౨౦

(ద్రౌపదిని జేరి) ఓపాంచాలీ! లే లెమ్మ. మన మిరువురమును సమానదుఃఖము గలవారమే. నీవు మాటిమాటికి మూర్ఛిల్లుచు, మీఁదుమిక్కిలి న న్నేల దహించెదవు.

ద్రౌప — (మూర్ఛదెలిసి) దుశ్శాసనుఁడు పట్టి యీడ్చుటచేత విడి పోయిన నా కేశపాశమును. దుర్యోధనరక్తమునఁ దడిసిన చేతులతో, నానాథుఁడు ముడువ వలయును. చేటీ! బుద్ధిమతికా! నీయెదుటనే గదా నాథుఁడు ప్రతిజ్ఞ చేసెను? నాకు వేణీమహోత్సవంబు నారంభింప వలసిన దని దేవకీనందనుండును సందేశము పంపెను గదా? కావున నుత్ఫుల్లకుసుమగామంబులం గొని తెచ్చి, నా వేణి నలంకరింపుము. భగవంతుం డగునప్పురుషోత్తమునివచనప్రకార మాచరింపవే. ఆయనయాలోచన కల్ల గాఁగూడదుగదా! అయ్యో! శోకజ్వరంబున నే నిట్లు పలవరించెద నేల? ఇంకను గడుదూర మరుగనిప్రాణనాయకునే యనుగమించెదను. మహారాజా! నాకుఁ గాష్ఠములం జేర్చి. చితిని బ్రజ్వలింపం జేయుఁడు. మీరును క్షత్రియధర్మము ననుసరించి, సాధునిజీవిత మపహరించినశత్రుపున కభిముఖు లయి పొండి.

యుధి — పాంచాలి బాగుగఁ జెప్పినది. కంచుకీ! దుఃఖమున మలుఁగుచున్న యీద్రౌపదికిం జితిని జేర్చి యారాటం బుడుపుము. నాకును సజ్యం బయినవిల్లు దీసికొని రమ్ము. అయినను వి ల్లెందుకు?

తే. గీ. భ్రాతృవాత్సల్యమున గాండివంబు విడిచి,
యతని నెత్తుటఁ దడిసినయరుణగదను
గొనుచు నర్జునుఁ డరిగెఁ; గావునను నాకు
నదియ మేఁ; లింకఁ జాలు జయాభిలాష. ౨౧.

రాక్ష — రాజా! నీచిత్తంబు రిపుజయవిముఖం బయినయెడల, నెక్కడనేని యొక్కడఁ బ్రాణపరిత్యాగము చేసికొనుము. వృథాగ నక్కడకుం బోవ నేల?

కంచు — (రోషముతో) ఛీ! మునిజనము పలుకఁ గూడనిరాక్షసార్హ వచనమును వచించితివి.

రా — (తనలో) నన్ను వీఁడు తెలిసికొనెనా యేమి చెపుమా? (ప్రకాశముగా) ఓకంచుకీ! ఇదిగో నిటు వినుము. ఇప్పుడచట నర్జునసుయోధనులకు గదాయుద్ధము జరుగుచున్నదిగదా! గదాయుద్ధమున వారిరువురభుజసారమునుగూడ నే నెఱుంగుదును. కావున నీవలెనే దుఃఖపడుచున్న యీరాజర్షికి, మరల నేమిదుర్వార్త వినవలసివచ్చునో యని, యట్లు పలికితిని.

యుధి — (కన్నీరు విడుచుచు) మునీంద్రా! మేలుమేలు? నాకు హితము నెఱింగించితిరి.

కంచు — మహారాజా! దేవసమానులగు కేవరవారు శోకాంధులయి ప్రాకృతజనునివలె క్షాత్రధర్మమును బరిత్యజింతురా?

యుధి — అయ్యా! జయంధరా!

తే. గీ. ఘనదహారిపురదర్పితోద్గాఢశౌర్య
పరిఘపీవరభుజభీమపార్థు లిపుడు,
పుడమిఁ బడి యుండ, వారి నుక్కడఁచి చెంత
శత్రువుఁడు నిల్వఁ, జూడ నాశక్య మగునె? ౨౨.

ఓపాంచాలరాజపుత్రీ! నాదుర్నయంబునఁ గదా నీ కీదుర్దశ సంప్రాప్త మయినది. కానీ, ఎంతవేగముగా నగ్ని బ్రజ్వలించిన, నంతవేగముగా మనబంధుజనమును గలిసికొఁగలము.

ద్రౌప — అయ్యా! చిదుగులం బేర్పుము. ఏమిది? మహారాజుగారివచనము నొక్కఁడైనను చేయకున్నాఁడు! హా! ప్రాణేశ్వరా! నీవు లేకుండుటను జేసి యిప్పుడు మహారాజు పరిజనులచేతఁ గూడఁ దిరస్కృతిని బొందుచున్నాఁడు.

రాక్ష — భరతవంశమునకోడండ్రి కిట్లు పత్యనుసరణము శ్లాఘనీయమే గదా!

యుధి — మునీంద్రా! మామాట నొకఁడును వినిపించుకొనకున్నాఁడు. మీరయిన నింధనప్రదానమున మమ్ముఁ గటాక్షింపుఁడు.

రాక్ష — రాజా! ఇది మునిజనవిరుద్ధము. (తనలో) నామనోరథములు పూర్ణముగా ఫలించినవి; కావున వీరికిఁ గనఁబడకుండ నిక్కడనే యుండి, చిదుగుల ప్రోవును బ్రజ్వలింపఁ జేసెదను. (ప్రకాశముగా) రాజా! ఇట్టిచో మేము నిలుచుటకు శక్తులముగాము. (నిష్క్రమించుచున్నాఁడు.)

యుధి—ద్రౌపదీ! మనమాట యెవ్వడును వినకున్నాఁడు. కాని. నేనే స్వయముగా దారుసంచయమును ప్రోవు చేసి చితి నంటించెదను.

ద్రౌప—త్వరపడు మహారాజ!

[తెరలోపలఁ గలకలము.]

ద్రౌప—(భయముతో విని) మహారాజ ! ఇది యొకానొక తేజోబలదర్పితుని నిర్ఘోషమువలె వినఁబడుచున్నది. మరల నేదో యప్రియము వినవలసివచ్చును. అందుకే మన మాలస్యము చేయుచున్నాము,

యుధి—ఆలస్యము లేదు. లెమ్ము. (అందఱును నడచుచున్నారు.)

యుధి—ఓపాంచాలీ ! అమ్మగారికిని, నీసవతులకును, జెప్పవలసిన దేమా చెప్పి, నీపరిజనమును బంపివేయుము.

ద్రౌప—మహారాజా ! బకహిడింబకిమ్మీరజరాసంధజయమల్లుఁ డయిన మీ మధ్యమపుత్రుఁడు హతాశుశ్వరాల నయిన నాయందలి ప్రేమచేతఁ బరలోకమున కేగినాఁ డని యత్తగారికి సందేశ మంపెదను.

యుధి—కల్యాణీ ! బుద్ధిమలికా ! అమ్మగారితో నాపలుకులుగా నిట్లు పలుకుము,

ఆ. వె. అంటుకొన్నలక్క యింట బిడ్డలు నీవు
బైటఁబడితి రవనిబాహుశక్తి,
నట్టియూరుబలాఢ్యుఁ డైననీప్రియపుత్రు
చావు నెట్లు వినుదు జనని! నీకు?

ఓయిజయంధర ! నీవును సహదేవునొద్దకుంబోయి, పూజ్యానిఁ బాండుకులబృహస్పతిని సైమాత్రేయు నాతినిం గాంచి, సకలకురుకులకమలాకరదావానలుండగుయుధిష్ఠిరుండు పరలోకంబునకుంబోవుచుండి, యనుకూలునాశంసనీయునతిప్రాజ్ఞునాపత్సంపత్సమాన ధీరు ననుఁగుఁదమ్ముని నిన్ను దగ్గఁ గౌఁగిలించుకొని, శిరము మూర్కొని, యిట్లు ప్రార్థించె నని చెప్పుము.

ఉ. ఏండ్లకుఁ జిన్న వయ్యు, నిజ మీవు సముండవు నాకుఁ దల్ప; జ్యే
ష్ఠుండను నేను సోదరతఁ; జూడ గురుండవు నీవు బుద్ధి, న
ట్లుండుటఁ జేసి, మౌళిఁ గరయుగ్మముఁ జేరిచి వేఁడుకొందు నిన్,
గొండిక ! వీడు నాయెడలఁ గూర్మి; విదుర్పుము నీట్ల దంత్రికిన్. ౨౮.

మఱియు బాల్యంబున నాచేతఁ బెంపఁబడ్డవాఁడు, నిరతాభిమాని, మేరుసమానహృదయ సారుండు. నకులుండును, నామాటమీఁద నిలువఁ దగినవాఁడు గావున, నాతనితోఁ గూడ నాపలుకులుగా నిట్లు పలుకుము. "వత్సా! నీవు మా మార్గ మనుసరింపఁ దగిన వాఁడవు గావు సుమీ.

మ. మము నీయన్నల నిద్దఱిన్ మఱచి పోవన్నౌ తెల్వి మైఁ; బాంధుతం
శను క్షీణించుడు, వధూగర్భజల మిమ్మా; నీవు దాయాదగే
హమునం బైనను, యాదవాన్వయమునం బైన, నృపారణ్యమ
ధ్యమునం బైన వసించి, పోషించుకొనవయ్యా నీయుదల్ తమ్ముఁడా!

జయంధర! నాతోడే నుపో. ఈసమాచారము నీవు శీఘ్రముగాఁ బోయి చెప్ప వలయును.

ద్రౌప— చేటి! బుద్ధిమతికా! నీవు ప్రియసఖి యయినసుభద్రయొద్దకుఁబోయి, నాపలుకుగా నిట్లు పలుకుము. "చెల్లెలా! మనకోడ లయినయుత్తరకు నిప్పుడు నాలుగవమాసము; కావున మనకులమును నిలువఁబెట్టఁ దగినదానిగర్భమును నీవుబహు జాగ్రత్తతోఁ గాపాడ వలయును. పరలోకమునకుఁ బోయిన మేనమామలకును, మాకును గూడ, నెప్పు డయిన నీళ్లునువ్వులు విడిచి పెట్టుట కాధార మగు"నని.

యుధి— (కన్నీళ్లతో) హా! ఎంతకష్ట మెంతకష్టము!

ఉ. వారిఁ గొమ్మలన్ దెసలఁ బ్రాఁకి మహీతల మావరించియున్,
లావుగ మ్రాను గట్టి, విపులం బగుపాదున నున్నవృక్షమే
దైవవశంబునం గరము దగ్ధము గాఁగను, దానిమొక్కయుం
దీ వడియాస నొందె దిది యిచ్చును నీడ యటంచుఁ గోమలీ! ౨౬

(కంచుకిని జూచి) అయ్యా! జయంధర! నామీఁద నొట్టుఁ బెట్టుకొన్నను నీవు వెళ్ళ కున్నావు గదా!

కంచు— (రోదనము చేయుచు) హా! దేవా! పాండురాజా! నీకుమారు లయినయుధిష్ఠి రభీమార్జుననకులసహదేవుల కెంతదారుణ మయినయవస్థ సంభవించెను! హా! కుంతిదేవీ! భోజరాజభవనపతాక!

ఉ. అన్న మగుండు నీకు, హరి కన్న, కిరీటికి బావ, కౌరవా
ధ్యున్నతకంజకుంజరమృగోదరు నొజ్జ, హలాయుధుం డయో!
యున్నను, యీజగంబునకు నెల్లను జల్లనినీడ నిచ్చునీ
కన్నకుమారు లన్నబలెగాన దహించెను, తుత్తొ శత్రిరో. ౨౭

(రోదనము చేయుచు నిష్క్రమించుచున్నాఁడు.)

యుధి— జయంధర ! జయంధర!

[కంచుకి ప్రవేశించుచున్నాఁడు.]

కంచు— దేవా! ఆజ్ఞాపింపుఁడు.

యుధి— మీయదృష్టములు చూడ నీపాటివిగా నున్నవి; అయినను మరల నొకమాట చెప్పఁగోరుచున్నాను. ఒకవేళ మాతమ్ముఁ డర్జునుఁడే జయించెనేని, నీవా తనితో నాపలుకులుగా నిట్లు పలుకుము.

చ. అరయఁగ నాదుతమ్ముమృతి కాబలరాముఁడె హేతువైన, నీ
పరమహితుండు కృష్ణునకుఁ బార్థుఁడ! యన్న గదా యతండు! తీ
వగపడఁ బోకుమీ యతనిపట్టున; నాపయిప్రేమ వీడు; ని
ష్కారుణపుత్త్రిము న్మరలఁ గైకొన; కేగు మరణ్యసీమకున్. —అని

కంచు—చిత్తము. దేవా! (నిష్క్రమించుచున్నాఁడు)

యుధి—(అగ్నిని జూచి సంతోషముతో) ఓహో! నావంటిదుఃఖము గలజనులను, బ్రజ్వలించుచున్నతనశిఖ లనియెడుహస్తములచేతఁ బిలుచుచు, భగవానుఁ డయినహుతాశనుఁడు, చక్కఁగ వెలుఁగుచున్నవాఁడు. కావున నాశరీర మిఁక నీయన కింధనముగా సమర్పించుకొనెదను

ద్రౌప—మహారాజా! నాథునికి నాయం దధికప్రేమ గావున, ముందుగా నేను బోయెదను. ప్రసాదింపుఁడు.

యుధి—అట్లయిన నీమహోత్సవ మిరువురమును గలిసియే యనుభవింతము.

చేటి—ఓహో! లోకపాలురార! మీరయిన నడ్డుపడి వీరిని రక్షింపుఁడు. ఈయనచంద్రవంశపురాజర్షి, రాజసూయాధ్వరంబునహుతవహునిఁదృప్తిఁబొందించిన రాజశ్రేష్ఠుఁడు, ఖాండవవనసంతర్పితహుతాశనుం డగునర్జునునకు జ్యేష్ఠభ్రాత, ప్రసిద్ధనామధేయుఁడు, యుధిష్ఠిరమహారాజు. ఈదేవి పాంచాలరాజకులదేవత, యజ్ఞవేదిమధ్యసముద్భవ, యాజ్ఞసేని; ఇట్టివీ రిద్దఱును విష్కారుణుఁ డయినయీకాలానలునకుఁ దమశరీరములను గట్టెపుడుకలనుగాఁ జేయుచున్నారు; అయ్యో! రక్షింపుఁడు రక్షింపుఁడు. (వారిముందఱఁ బడి) దేవా! దేవీ! ఏమి చేసెదరు?

యుధి—ఓసీ! బుద్ధిమతికా! ప్రాణసమానుఁ డయినతమ్ముఁడు, ప్రాణనాథుఁడును, బోయి నప్పుడు చేయఁదగిన దేమో యది చేసెదము. కల్యాణీ! లెమ్ము లెమ్ము. ఉదకమును దీసికొని రమ్ము.

చేటి—దేవా! చిత్తము (నిష్క్రమించి మరలఁ బ్రవేశించి) జయముజయము మహారాజా! ఇదిగో! జలపూర్ణ మయినభృంగారము.

యుధి—పాంచాలీ! నీవును నీయందుఁ బక్షపాతము గలభీమునికిని, బ్రియుఁ డయినయర్జునునికిని, శీఘ్రముగా నుదకక్రియ నాచరింపుము.

ద్రౌప—మహారాజా, మీరే యట్లు గావింపుఁడు. నే నగ్నిహోత్రమునఁ బ్రవేశించెదను,

యుధి—లోకాచార మతిక్రమింప రాదు గదా! బుద్ధిమతికా! ఉదక మిటు తే.

చేటి—(అట్లు చేయుచున్నది)

యుధి—(పాదప్రక్షాళనము చేసికొని యాచమించి ప్రాచీనావీతి యై దేవభాషతో) ఏష తావత్సలిలాంజలి ర్గాంగేయాయ భీష్మాయ గురవే, ప్రపితామహాయ శాంతనవాయ; అయ మపి పితామహాయ విచిత్రవీర్యాయ. (కంట నీరు పెట్టుకొని) తండ్రీ! ఇప్పుడు నీవంతు వచ్చినది. (మరల దేవభాషతో) అయ మపి తత్రభవతే స్వర్గస్థాయ గురవే సుగృహీతనామ్నే పిత్రే పాండవే.

ఆ. వె. తర్పణములు మీకుఁ దండ్రి! యింతటనుండి
యేను విడువ సంభవించు దెపుడుఁ;
గాన నిప్పు డేను గన్నీళ్ళతో నిచ్చు
సలిల మంబతోడఁ గలిసి క్రోలు. ౨౯.

ఆ. వె. తండ్రి! జలజనయన! తమ్ముఁడా! భీమన్న!
యీజలంబు మనకు నిద్దఱకును;
దప్పిగొనిన నీవు త్రాగుమీ ముందు;
నేను నిదిగొ! క్షణములోనె వత్తు. ౩౦.

ఏమి నాశక్తి! యుద్ధములోఁ జచ్చుటచేత నుత్తమక్షత్రియులలోకమును బొంది యున్న నాతమ్ముని, నే నీవిధమునఁ బ్రాణత్యాగముఁ జేసికొని చూడఁ గలనా? చూడ లేను. తమ్ముఁడా! భీమసేన!

చ. కుడిచితి వీవు నేఁ గుడుచుకొన్నయనంతర మమ్మచన్ను; ప్రే
ముడిఁ గొనవైతి వన్నరసముల్ మును నేఁ గొనకుండ నెన్నఁడున్;
నడిచితి వన్న! యిట్టి సవనంబులయందును సోమపాన; మి
ప్పుడు తగునా నివాపజలముల్ మును ద్రావఁగ నీవు తమ్ముఁడా? ౩౧.

ద్రౌపదీ! పూజ్యుఁ డయినభీమునకు దోసెఁడునీళ్ళు విడిచి పెట్టుము.

ద్రౌప— చేటీ! బుద్ధిమతికా! ఉదక మిటు తే.

చేటి—(అట్లు చేయుచున్నది.)

ద్రౌప—(సమీపించి, దోసిలి నిండ నీళ్ళు పోసికొని) ఈనీళ్ళెవరికొఱకు విడిచి పెట్టుదును?

యుధి—ఆ. వె. కన్నతల్లి యిపుడు గాంధారితోడ స
మానదుఃఖురాలిఁ గా నొనర్చి,
స్వర్గమునకు నెవఁడు చనియెనో ముందుగా,
వానికొఱకు విడువ వలయు నెలఁత! ౩౨.

ద్రౌప—ప్రాణేశ్వరా! స్వర్గస్థుఁడవయిననీకుఁ బరిజనోపనీత మిది పాదోదక మయ్యెడును.

యుధి—ఓయర్జునాగ్రజ!

తే. గీ. చ్రిలిన నెలవేర్పుకోరయే చరమగతికిఁ
బోయితివి గానఁ, దమ్ముఁడా! పొలఁతి నీకుఁ
దల విరియఁ బోసికొని జలాంజలి నొసంగుఁ,
గొలుకులను వేఁడికన్నీరు లొలుకు చుండ. 33.

ద్రౌప—లేలెందు మహారాజా! ఈపాటికి మీసోదరుఁడు చాల దూరము పోవును గదా!

యుధి—(కుడికన్నదరుట సూచించి) పాంచాలీ! భీమునిఁ ద్వరగఁ గలిసికొనియెద నని శకునములు నాకుఁ జెప్పుచున్నవి. కానీ. శీఘ్రముగా నగ్నిని సమీపింతము.

ద్రౌప—అహా! భగవానుఁడు హుతాశనుఁ డెంతచక్కఁగా వెలుఁగుచున్నాఁడు.

[తెరలోఁ బెద్దకలకలము]

[తత్తఱపాటుతోఁ గంచుకి ప్రవేశించుచున్నాఁడు.]

కంచు—రక్షింపురక్షింపుమహారాజ! ఇదిగో! దురాత్ముఁ డయినదుర్యోధనుఁడు నెత్తుటితో స్నానము చేసి, రక్తాంబరుండును, రక్తాభిషేకభీషణగదాపాణియు నయి, యుద్ధతకాలదండుం డగుయముండునుం బోలెఁ బూజ్యురా లయిన పాంచాలి నిందునందు వెదకుచు, నీలాగుననే వచ్చుచున్నాఁడు.

యుధి—హా! దైవమా! నీనిర్ణయము జరుగుచున్నది. హా! గాండీవధన్వ! (మూర్ఛిల్లుచున్నాఁడు.)

ద్రౌప—హా! ప్రాణేశ్వరా! మామకస్వయంవరస్వయంగ్రాహకుటుంబీ! ధనంజయా! నీప్రియసోదరునిఁ గలసికొని మహారాజును నన్నును విడిచి పెట్టితివిగదా నాథా! (మూర్ఛిల్లుచున్నది.)

కంచు—దేవా! ఊఱడిల్లు మూఱడిల్లుము

యుధి—(మూర్ఛ దేఱి) హా! వత్స! హా! సవ్యసాచీ! హా! ప్రిద్ధత్రిలోచనాంగనిష్పేషసాహసద్విశమల్ల! హా! నివాతకవచోద్ధరణనిష్కంటకీకృతామరలోక! హా! బదర్యాశ్రమమునిద్వితీయతాపస! హా! ద్రోణాచార్యప్రియశిష్య! హా! అస్త్రశిక్షాబలపరితోషితగాంగేయా! హా! రాధేయకులకమలినీప్రాలేయసారశరనిచయా! హా! గంధర్వనిర్వాసితసుయోధన! హా! పాండవకులకమలినీరాజహంస!

తే. గీ. అనుఁగుదల్లికి మ్రొక్కక, వినయమునను
గౌఁగిలించుక నాయాజ్ఞఁ గాంచ కకట!
యాస్వయంవరవధువు నీక్షింప కీవు
దవ్వుఁబయనంబు వోనేల? తమ్ముఁగుఱ్ఱ.

కంచు—అయ్యయ్యో! ఎంతకష్టము! దురాత్ముఁ డయినదుర్యోధనుఁడు ఇచ్ఛలవిడి నీలాగే వచ్చుచున్నాఁడు.

యుధి—అయినచో సర్వథా యిప్పు డిదే కాలోచిత మయిన ప్రతీకారము. బుద్ధిమతికా! పూజ్యురా లగునీపాంచాలిని జలియొద్దకుఁ దిసికొని పో. నేను నీ వెనను సరించెదను.

చేటి—అయ్యో! రక్షింపుఁడు రక్షింపుఁడు.

కంచు—కల్యాణీ! నీ మొఱ్ఱ నకులసహదేవులకా? దేవిగారియన్న యాగః ద్యుమ్నునకా? ఇపుడు వారికంటె మఱిరక్షకు లెవ్వరు? మహారాజునవస్థ యీలాగుండెను. అయినభీమార్జును లిద్దఱు నస్తమించిరి.

[తెరలోఁ గలకలానంతరము.]

ఓహో! శమంతపంచకసంచారులార! రుధిరాస్వాదమత్తయక్షరాక్షసపిశాచభూతవేతాళకంకగృధ్రజంబుకోలూకవాయసభూయిష్ఠావశిష్టకలకయోధులార! నన్నుఁ జూచి యడలి పోకుఁడు. ద్రౌపది యెక్కడ నున్నదో చెప్పుఁడు. ఇదిగో! నావాలుఁ గ్రుటి కానవాలు చెప్పుచున్నాను. వినుండు.

ఉ. కురు లొకచేతితోఁ జెఱచుకొంచు సుయోధనుఁ డొక్కఁ డూడ సం
బర మొలువంబడెన్; మఱియుఁ బల్వురలోపల దుస్ససేనుఁ డు
ద్ధురతను బట్టియీడ్చుటను, ద్యూతముంగురు లన్ని దీర్చె; న
వరుసఁ బరాభవంపడినపైదలి, యెక్కడ నుండెఁ జెప్పుఁడీ;

కంచు—ఓ దేవీ! యాజ్ఞసేని! నీ విప్పుడు గూడ ననాథ వయి కురుకుల కలంకునిచేతఁ బరాభవము నొందుచున్నావు గదా!

యుధి—(జగ్గున లేచి) పాంచాలీ! జడియకు జడియకు. నాకు సజ్యం బయిన ధనువు దెప్పింపుము. దురాత్మ! దుర్యోధనహతక! రా. రా. నాబాణవర్షమున నీ గదాకౌశలసంభూతభుజబలపరాగ మణఁచి వేసెదను. ఓరీకురుకులాంగార!

తే. గీ. అలజరాసంధుఁ జంపినయట్టితమ్ము,
హరకిరాతుని గెలిచినయట్టితమ్ముఁ
దలఁచి, నీలాగు బాయి నై నిలువ నైన,
నిన్ను వధియింప నైనను, నేర నేను.

(తరువాత గదాపాణియు రక్తసిక్తాంగుఁడు నగుభీమసేనుఁడు
ప్రవేశించుచున్నాఁడు.]

భీము—(వడిగా నడచుచు) ఓహో! శమంతపంచకసంచారు లయిన సైనికులారా! ఏ మాత్రల్లడము?

శా. ఏ రక్తస్సను గాను, భూతమనుగా; నేలా మృతేభాశ్వవి
స్తారాంగంబులక్రింద దాఁగ? హతశేషక్ష్మాపులారా! ద్విష
చ్ఛారీరక్షతజాభిషిక్తతనుఁడన్, సంలంఘితోరుప్రతి
జ్ఞారత్నాకరుఁడైనక్షత్రియుఁడ నే; శంకింప మీ కేటికిన్? ౭౭.

కంచు—దేవీ! పాండుస్నుషా! లెమ్ము లెమ్ము. ఇప్పుడు హఠాత్తుగాఁ జిచ్చుఱుకుటయే శ్రేయంబు.

ద్రౌప—(వెంటనే లేచి) నే నిప్పుడు కూడఁ జితిని సమీపింపకుందునా? (చితి కభిముఖి యయియున్నది.)

యుధి—యెవఁడురా అక్కడ? అస్త్రాలపొదియును విల్లును దీసికొనిరా. ఏమిది పరిజనుఁ డెవ్వఁడును లేఁడయ్యెనా? పోనీ. బాహుయుద్ధముచేతనే యీ దురాత్ముని గట్టిగ నాసందిటను బట్టి, మండుచున్న యీ యగ్నిహోత్రమునఁ బడవేసెదను. [నడుముగట్టుచున్నాఁడు.]

కంచు—దేవీ! దుశ్శాసనాకృష్టంబు లయి కన్నుల కడ్డు పడుచున్న నీకురులను, నీవే యిప్పుడు ముడిచుకొనుము. ప్రతీకారము నెడ నాస యింక వదలి పోయెను గదా! వేవేగఁ జితియొద్దకుఁ బోవలయును.

యుధి—వలదువలదు. దుర్యోధనహంతకుఁడు చావకుండ, నీతలవెండ్రుకలు ముడువఁ గూడదు.

భీము—పాంచాలీ! నేను జీవించియుండఁగా, దుశ్శాసనుఁడు చిక్కుపఱిచిన నీకురులను నీచేతులతో ముడుచుకోరాదు. ఉండు. నేను ముడిచెదను.

ద్రౌప—(భయపడి పరుగెత్తుచున్నది.)

భీము— నిలునిలు. భీరురాలా! ఇప్పు డెందుఁ బోయెదవు?

(కేశపాశమును బట్టుకొనఁ దలఁచుచున్నాఁడు)

యుధి—(సత్తువకొలఁది భీముని సందిటం బట్టి) దురాత్మా! భీమార్జునవైరీ! దుర్యోధనహతక! ఇప్పుడు నీ వెందుఁ బోయెదవురా?

ఉ. చిన్నతనంబునుండియును జేసితి వెగ్గులు మాకుఁ; బ్రత్యహం
బు న్నిజబాహుదర్పమునఁ బొంగెదు; చంపితి రాజపుత్రులన్;
బన్నుగ నస్మదీయభుజపంజరమం దిటు చిక్కినావురా
చెన్నఁటి! యింక నీతరమె జీవముతో నడుగైనఁ బోవఁగన్? ౭౮

భీము—అహో! నన్ను దుర్యోధనుఁ డనుకొని కాఁబోలు, ఈమహారాజు నాయెమ్ముకలు చూర్ణ మగునట్లు, నిర్దయముగాఁ గౌఁగిలించుకొనుచున్నాఁడు. అన్నయ్యా! అనుగ్రహింపుఁ డనుగ్రహింపుఁడు.

కంచు—(పోల్చి చూచి సంతోషముతో) ఏమి! భీమసేనకుమారుఁడా? నాయనా! అదృష్టవశమున బ్రతికి వచ్చితివి. మహారాజ! ఇతఁ డాయుష్మంతుఁ డగుమనభీమసేనుఁడే సుండీ. దుర్యోధనరక్తముచేత నొడలును బట్టలును, దడిసి యొత్తుపడుటచేత, రూపు మాఱి పోల్పరాఁ డయ్యెను. ఇంకను శంకింపవలదు.

చేటి—(ద్రౌపదిని గౌఁగిలించుకొని) దేవీ! ఇదిగోఁ! దన ప్రతిజ్ఞను నెఱవేర్చుకొని వచ్చి, నీప్రాణనాథుఁడు నీకు వేణీసంహారమహోత్సవము సేయఁగోరి, నీకొఱకు వెదకుచున్నాఁడు.

ద్రౌప—చేటీ! నన్నుఁ గల్లమాటలతో నూఱడించెదవా?

యుధి—జయంధర! నిజమే గదా? వీఁడు నావైరి యాయినదుర్యోధనహంతకుఁడు గాఁడు గదా?

భీమ—దేవా! అజాతశత్రూ! భీమార్జునాగ్రజ! ఇంకను దుర్యోధనహతకుఁ డెక్కడ? నాచేతఁ బాంధవకులపరిభావి యయినయాదురాత్ముని—
లయగాత్రిహి. కాయ మిలఁ గూలెను నపాయమును బొందె; మయిఁ

బూయఁబడెఁ జందనముచాయ రుధిరంబుఁ;
ద్రోయ ధికుప్కపరిఘాయతధరాజయగ
మాయంవతి నిర్చ భవదీయభుజపీఠిఁ;
దోయములు సైనికనికాయములు నా?మహా
నీయసమరాగ్ని శలభాయితము లయ్యెఁ;
మీయనినవే రొకటియే యిపుడు దక్క మిగు
లేయదియు లేదరి కమేయమహిమాఢ్య! ౩౯

యుధి—(భీమునిఁ జూచుచుఁ గన్నీళ్లు దుడుచుకొనుచున్నాఁడు.)

భీమ—(కాళ్ళమీఁదఁ బడి) అన్నయ్యా! జయము జయము.

యుధి—తమ్ముఁడా! బాష్పజలపూరితలోచనుండ నయి, నీముఖచంద్రునిఁ జూడలేక పోయితిని. అర్జునితోఁ గూడ నీవు జీవించి యున్నావా? చెప్పుము.

భీమ—నిహతాశేషశత్రుపక్షు లయి దేవరవారు సుఖించి యుండఁగా, భీమార్జునుల కేమి కొఱఁత?

యుధి—(మరలఁ బ్రేమతో గాఢాలింగనము చేసికొని)

చ. అరివధ యుండని మ్మటు, రయంబున ముం దిది చెప్పుమా, బకా
నురుఁ గడతేర్చినట్టిప్రియసోదరుఁ డైనవృకోదరుండవే?

భీమ—అవు నన్నయ్యా! నేనే.

యుధి—

కరమును నోలలాడితివిగా! మును మాగధుపీనవక్షమున్
సరసునఁ జల్లులాడుచును సంభరితక్షతజాంబుమండలిన్. ౮౦.

భీము—అవు నన్నయ్యా! మీ రొక్కక్షణము నన్ను విడిచి పెట్టుఁడు.

యుధి— ఇంకను నవశిష్ట మేమి?

భీము—అన్నయ్యా! గొప్పయవశిష్టమే యున్నది! ఇదిగో! దుర్యోధన దుశ్శాసనులరక్తముచేతఁ దడిసినయీచేతులతోడ, దుశ్శాసనాకృష్టము లగు పాంచాలికురులు ముడిఁచి వచ్చెదను.

యుధి—అటు లయిన శీఘ్రముగా నరుగుము దీనురాలయినద్రౌపది వేణీసంహారమహోత్సవ మనుభవించుఁ గాక.

భీము—పూజ్యురాలా! ద్రౌపదీ! అదృష్టవశంబున రిపుకులక్షయంబయ్యెఁ గావున, నీవింక సుఖంబుండుము.

ద్రౌప—(సమీపించి) నాథా! జయ మగుఁగాక! జయ మగుఁగాక!
(భయముచే వెనుఁదీయుచున్నది.)

భీము—రాజపుత్రీ! నన్నుఁ జూచి భయపడియెద వేమి? ఇదిగో విను—

ఉ. ఏవృషభుండు రాజసభ నీడ్చెనొ ముందలఁ బట్టి నిన్ను, నా
హీనునిశోణితంబు; స్పృశియింపుము చేతుల నంటెఁ ద్రాగుచోఁ;
జానరో! కౌరవేశుక్షతజం బిది; మద్గదఁ జూర్ణితోరువుం
గా నొనరించి, మై నలఁదఁ గంటెఁ, బరాభవవహ్ని యాఱఁగన్. ౮౩.

బుద్ధిమతికా! పాండవదార నపహసించినభానుమతి యిప్పు డెక్కడ నున్నదే?
కానీ. వేదిసంభవులారా! యాజ్ఞసేనీ!

ద్రౌప—ప్రాణేశ్వరా! ఆజ్ఞాపింపుము.

భీము—నాఁడు నే నన్నయీమాట తలంపునకు వచ్చినదా?

చ. బిఱబిఱఁ ద్రిప్పుకొంచు గద; బిట్టు సుయోధనుఁ గిట్టి, పెందొడల్
విఱుగఁగఁ గొట్టి చేతులను వెచ్చనినెత్తుట నద్ది, నీకురుల్
మెఱుఁగిడి, భీమసేనుఁ డవలీలను జక్కఁదలించి కూర్చెడున్;
గొఱకొఱ యేల? దేవి! యిదిగో! ముద మందెదు చూడు నీమదిన్.’’

(ఈపూర్వోక్తపద్యమును జదువుచున్నాఁడు)

ద్రౌప—ప్రాణేశ్వరా! తలఁపునకే కాదు, అనుభవమునకును వచ్చినది.

భీము—(ఆమెవేణిని ముడుఁచుచు) దేవీ! దుశ్శాసనపాణిలులితంబయి ధార్తరాష్ట్రకాళరాత్రి యయిననీవేణి, నిఁక నీవు ముడుఁచుకొనుము.

ద్రౌప — నాథా! ఈవ్యాపారము నాకీవలలో నలవాటు దప్పెను. ఇంక భవ దీయప్రసాదంబున మరల నేర్చుకొనవలెను.

చేటి — (వేణిని ముడుచుచున్నది.)

మహాస్రగ్ధర. కురునాథుల్ క్రుద్ధచిత్తుల్ గురుభుజబలులౌ కుంతిపుత్రుల్, నృపాంతః
పురముల్ నిర్ముక్తకేశంబులుగ సలుప యన్యోన్యక్షమే మూల మౌఁ, ద
ద్వారికృష్ణావేణి, క్రోధోద్ధతయమసఖము౯, ధార్తరాష్ట్రాంతకంబు౯
బరిబద్ధంబయ్యెఁ; జావుల్ ప్రజలకుఁ దిగదు౯, స్వస్తియౌ గౌండ్లకెల్ల౯.

యుధి — దేవీ! ఇదిగో! అంతరిక్షసంచారు లగుసిద్ధజనంబులు నీవేణీసంహార మహోత్సవంబునకు సంతసించుచున్నారు.

[తరువాతఁ గృష్ణాను లు ప్రవేశించుచున్నారు]

కృష్ణ — విజయతామ్ నిహతసకలారాతిమండల స్సానుజః పాండవకులచంద్రమా మహారాజో యుధిష్ఠిరః.

అర్జు — విజయతా మార్యః

యుధి — (చూచి) ఓహో! భగవంతుఁడు పుండరీకాక్షుఁడును, చిరంజీవి యర్జునుఁడు నా? (కృష్ణుని) దేవా! నమస్కరించుచున్నాను. (అర్జునుని) తమ్ముఁడా! ఇటు రా. నన్ను గట్టిగాఁ గౌఁగిలించుకో.

అర్జు — (నమస్కరించుచున్నాఁడు)

యుధి — (కృష్ణునితో) దేవా ! భగవంతుండును బురాణపురుషుండును నగు శ్రీమన్నారాయణుండు స్వయముగా మంగళములను గోరువానికి విజయము గాక మఱి యేమి యగును ?

చ. గురుసుహృదాదివృత్తి నొనగూడినరూపమువాని, సృష్టిసం
భరణవినాశహేతు వగువానినిఁ, బుట్టువు లేనివాని, ని
ర్జరుని, నచింత్యునిం, గుణవిరాజితు, నిన్నుఁ దలంచునంతనే,
నరులకు దుఃఖముల్ దొలఁగు నాఁ, గనువారికిఁ జెప్ప నేటికి౯? ౪౩.

(అర్జునుఁ గౌఁగిలించుకొని) వత్సా! నన్నుఁ గౌఁగిలించుకో.

అర్జు — (కౌఁగిలించుకొనుచున్నాఁడు)

కృష్ణ — ఇదిగో! మహాత్ము లయినవ్యాసవాల్మీకిజామదగ్న్యజాబాలిప్రభృతి మహర్షులు కల్పితాశేషమంగళసమారంభు లయి వచ్చి యున్నారు. మఱియు నకుల సహదేవధృష్టద్యుమ్న సాత్యకిప్రముఖసేనానాయకులును, స్కంధోత్తంభిత తీర్థవారి కలశు లయి, మీయభిషేకమును గోరుచున్నవారు. నేనును జార్వాకుఁడు మిమ్ము

వంచించుటవ్యాసమహర్షివలనఁ దెలిసికొని, యతిత్వరితముగా నర్జునునితో భవత్సకాశ
మునకుఁ జనుదెంచితిని.

యుధి—ఏమీ? మమ్ముఁ జార్వాకుఁడు మోసపుచ్చెనా? (కోపముతో) దుర్యోధనసఖుఁడు వాఁ డెక్కడ నున్నాఁడు? ఆరాక్షసాధముఁడు నాచిత్తముచాల నుత్తలపఱిచెను.

కృష్ణు—ఆదురాత్ముఁడు నకులునిచేతఁ జిక్కినాఁడు. మహారాజా! నీ కింత కంటెఁ గోరఁ దగినద యేమున్నదో చెప్పుము.

యుధి—భగవంతుఁ డగుదేవర ప్రసన్నత నొందిన, నీయతాని ,దేమి గలదు, మానవమాత్రుఁ డనుబుద్ధితో నీతోఁ గ్రీడ లాడుచుంటిని. నాకింతకంటెఁ గోరఁదగిన దే మున్నది? దేవా! చూడుము.

ఉ. చెక్కు డెమర్ప దేవురకుఁ; జెండితి మొంటనివారిఁ; గృష్ణయాం
దక్కక నాగుదుర్నయమునం బడి దాఁటెఁ బరాభవాంబుధిన్;
మక్కువ మాట లాడెద వనంత! కృతార్థుఁడఁ గానె నేఁడు? ని
న్నక్కజతోడఁ గోర, నిఁక నన్యము లుండు నటయ్య కోరికల్? ౮౮

అయినను దేవా! నీవు ప్రసన్నుండ వయితివి గాన నిట్లగుఁగాక.

మానిని. లోకులు దీనత లేక శతాబ్దములుం బ్రదుక న్వలె సౌఖ్యమునన్;
బ్రాకటతావకభక్తియు నద్వయభంగి లభింప వలె; న్నృహరీ!
లోకహితుండును, బండితబాంధవుఁడున్, గుణభూరివివేకుఁడు. న
స్తోకసుభంకరుఁ డేచును రాజు, వసుంధర నెమ్మది నేల వలెన్.

కృష్ణు—తథాస్తు! (అందఱు నిష్క్రమించుచున్నారు.)

గద్యము. ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదలబ్ధసరసకవితాధురంధర వడ్డాది
సాధువంశక్షీరనీరాకరరాకాసుధాకర రాచ్చనామాత్యపౌత్ర హరి
తసగోత్ర·పవిత్రగుణకదంబలక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల
సూరపరాజప్రధానతనూభవ విబుధవిధేయ సుబ్బ
రాయనామధేయాంధ్రీకృత వేణీసంహార
నాటకంబునందు సర్వంబును,
షష్ఠాంకము,
సంపూర్ణము.

——

# విక్రమోర్వశీయము.



రెండవకూర్పు. చక్కనిఅచ్చు.

ఇది కాళిదాసమహాకవివిరచితమునకుఁ దెలుఁగు. అప్సరస యగు నూర్వశిని రాక్షసుఁ డొకరుఁ డపహరించి యంతరిక్షమార్గమునఁ గొనిపోవుచుండఁగా, నామెతోడిచెలికత్తెలమొఱ్ఱ విని యాకాశగమనమునఁ బ్రావీణ్యముగలపురూరవశ్చక్రవర్తి యారక్కసు నుక్కడంచి యామెను విడిపించిన కారణమునఁ బరస్పరానురాగ మంకురించి వారిరువురును వివాహముచేసికొనిరి. ఈవిషయమే బహువిధచమత్కారములు గలుగునట్లుగా రసపోషణము చేసి యైదంకముల నాటకముగాఁ గవి రచియించినాఁడు. శృంగారరసప్రధాన మయినట్టి యీ నాటకమునందలి భావములు మిక్కిలి పేశలములు. రసగ్రహణలాలసుల కిది యవశ్యము పఠనీయము. ఏతన్నాటకమునందలి పద్యములు మచ్చున కిట నొకటి రెండు చూపఁబడుచున్నవి.

దీనివెల రు. 0—8—0 అణాలు మాత్రమే!

ఉ. అందనిమ్రానిపండుగొన నఱ్ఱు నిగుడ్చుచుఁ ద్రిప్ప రానినా
డెందముఁ గొందలంబునఁ జెడెన్ మును పేర్విషమాస్త్రుఁ; డిప్పుడే
మందును? మందమందమలయానిలపాతితపాండుపత్రిమా
కందము లిందుఁ బ్రాఁదొడిమగంటులఁ జూపెడు నంకురావళుల్.

తే. గీ. స్యందనక్షోభమునఁ జేసి యిందువదన
యంస మంసములోడ రాపాడఁగానఁ
దలఁప నీభుజ మొక్కటే ధన్య; మితర
మైనమే నెల్ల భూమికి నతిభరంబు॥ తృతీయాంకము.

చ. తొలకరినీలమేఘ మిది, దుష్టనిశాటుఁడు గాఁడు; దాన ను
జ్జ్వల మగునింద్రచాప మిది, సజ్యము దానవువిల్లు గాదు; కే
వలమును వర్షధార లివి, బాణపరంపర గాదు; పైఁడిగీ
టలఁ దలఁపించుమించిది హృదీశ్వరి యూర్వశి గాదు రూఢిగా॥ చ. అం.

చ. కొడుకు మొగంబుఁ జూచి మదిఁ గుందకయా యటఁ జెందియుండఁగా
బడఁయక నీ వియోగ మనివార్యత నిప్పుడ సంభవించెఁగా
మిడిమిడిగ్రీష్మతాపము శమింప నవాంబునవృష్టిఁ గాంచి యా
స్పెషతతిఁ జెట్టుపైఁ బిడుగు భీకరభంగిని బడ్డకైవడిన్. పం. అం.

వలయువారు గ్రంథకర్తగారి కిట్లువ్రాసికొనుడు:—

వడ్డాది సుబ్బారాయకవిగారు

రాజకీయకళాశాలాంధ్రపండితులు, రాజమహేంద్రవరము.

ఉ. నన్నయతిక్కనాదిరసనల్ గురియించినచాటుధార లీ
మన్నున నింకఁ బోలు; నణుమాత్రముఁ దద్రస మబ్బ దెందు; హా!
జొన్నలలోనఁ జన్నపువుజొన్నటు, లట్టులు పద్దియంబులన్
మిన్నలు చాటువుల్, రససమృద్ధి ననిర్వచనీయమాధురిన్.

# వసురాయచాటుప్రబంధము.

ఇది వేఱువేఱు సందర్భములం దప్పుడప్పుడు వివిధాంశములను గూర్చి నేను రచియించుచువచ్చినపద్యము లన్నిటిని విషయానుకూలములుగా విభాగించి, తత్తదుచితశీర్షికలతో నూతనముగా ముద్రింపించిన నానావిధచమత్కారకల్పనములతోడి యపూర్వగ్రంథము. చిరకాలముక్రిందట నెల్లూరిలోఁ బ్రకటితమగుచువచ్చిన "మంజువాణీ" మాసపత్రికలో, "వసురాయచాటూక్తిముక్తావళి" యనుశీర్షికతోఁ బత్రికాధిపతులు నాచాటుపద్యములుకొన్ని 1899 వ సంవత్సరములోఁ బ్రకటించుచుండఁగా, వానిని జదివినసజ్జను లనేకులు వసురాయచాటూక్తిముక్తావళిని వి. పి. గాఁ బంపుఁడని దూరదేశములనుండి వ్రాయ నారంభించిరి. అందువలన నధికమైన ప్రోత్సాహము గలిగి, శీఘ్రముగా నచ్చొత్తించు ప్రయత్నముతోఁ దద్గ్రంథ మచ్చులో నున్నదని నాపుస్తకములపట్టికలోఁ బ్రకటింపించితిని, కాని, "తే. ఇచ్ఛయున్న! సిద్ధి విధిహస్తగత సీమచింతలార !" యను ప్రకృతిప్రకరణములోని సూక్తిప్రకారముగా నింతకాలమునకుఁ గాని యాతలంపు నెఱవేఱుట కవకాశము కలిగినది కాదు.

పై "వసురాయచాటూక్తిముక్తావళి" యనునదియే యిప్పుడు "చాటుప్రబంధ" మను నామాంతరముతో ముద్రింపఁబడినది. ఇందుఁ బ్రశంసా, ప్రకృతి, ప్రాస్తావిక, ప్రకీర్ణ, స్వవిషయములను నైదుప్రకరణములును దాదాపు 1400 కందగీతసీసవృత్తములును గలవు.

గ్లేజు డెమ్మీసైజు ఆకారము 300 పేజీలు. వెల రు 1—8—0.

రాజమహేంద్రవరము,
ది 1—1—1925.

వడ్డాది సుబ్బారాయుఁడు.

